ఏప్రిల్, ౧౯౫౯



# జయంతి

# 6

సంపుటము 1 సంచిక 6

---

ఈ సంచికలో

ఆధునిక సాహిత్య గతిని సూచించే

*హిందీ మాసపత్రిక :*

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౨౧౬, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.




# జయంతి
## 6

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.






సంవత్సర చందా రూ. ౮-౦
విడిప్రతి ౬౫ న. పై.

# చర్చావేదిక

## సాహిత్య మీమాంస

అయ్యా! రాంషాగారూ!

జయంతి రెండవ సంచికలో ప్రచురింపబడిన నా వ్యాసముమీద మీరు లెస్సగా చర్చచేసినారు. అభిప్రాయభేదము లుండవని కాని— ఉండరాదని కాని, నాదే తిరుగులేని సిద్ధాంతము కావలయునని కాని అనుకొను స్థితిలో నేను లేను. మంచి, చెడు, ఈ రెండునుగాని స్థితి - లోకములోని ప్రతి విషయమునకు సంబంధించిన స్థూలవిభజనమిది. విమర్శన విషయమున ముందు నే నక్లేచేసితిని. ఇందు కుపబలకముగా T. S. Eliot The Sacred Wood అన్న వ్యాస సంపుటిలో Perfect, Imperfect అన్న విశేషణాలతో విమర్శకులుగా చలామణిలో నున్న వారిని గుర్తించి వారివారి విమర్శనా ధోరణులను చర్చించి యున్నాడు- ఆ విభజన కొంత చమత్కారముగాను, పుష్టముగాను నున్నందున నేను దానినే అనుసరించినాను. క్షుత-అక్షుత శబ్దాలు వాడుట నాకును బాగులేదు. పైగా వాటిని తరువాత తరువాత వాడుకలోనికి తీసికొని రాకుండనే వ్యాసములు వ్రాయుచున్నాను. జయంతి నాలుగెదు సంచికలలో ప్రచురింపబడిన నా వ్యాసములలో ఆ శబ్దముల ప్రసక్తి రాలేదు. తమరును గుర్తించియుందురు.

ఇక మీ వ్రాతను గురించి ప్రచారకులని నేను కొందరిని పేర్కొనుట సమంజసముగా లేదన్నారు మీరు. మంచిదే. "కళ కానిది ప్రచారమనే భావం ఒకటి సాహిత్యకులలో వున్నది విమర్శను కళగా చెప్పలేము గనుక విమర్శకులు ప్రచారకు లవటం తప్పు కాదు. అసలు విమర్శనా వ్యాపారమే ప్రచారం" అన్నారు. విమర్శన ప్రచారమైనప్పుడు గేయాలు వ్రాయుట-డిటెక్టివు కథలు వ్రాయుట మాత్రమేల ప్రచారము కాదు? ఒక స్వతంత్రమైన దృష్టి కలిగి విషయ వివేచనము చేసినవాడు చెప్పునదియు, అట్లుగాక ఇంకొకడు వా రన్నది, వీ రన్నది యథాతథముగా తీసికొని ఆంతర్యమెరుగక చెప్పునదియు రెండును ప్రచారముతే యని మీయభిప్రాయము. మొదటివానిని ప్రచారకుడని నే ననలేకున్నాను.

"విమర్శన మనగా విడమరచి చూపడమో, చూడటమో అవుతున్నది" అని హడ్సన్ మహాశయుని తాత్పర్యమును మీరు చెప్పి, అదే పరమ సిద్ధాంతమని నమ్మి - ఇక మీరేమియు ఆలోచింప నక్కరలే దనుకొని మాటాడినారు. హడ్సన్ మహాశయుని గ్రంథమే మీకు వేదమువలె అగుట కూడనిది. ఆ గ్రంథము నంతగా నమ్ముకొన్నారు గనుకనే "సాహిత్యాన్ని గురించి వ్రాసేవారై తే చాలు" విమర్శకులనే "పేరుకు అర్హులౌతారు" అని సిద్ధాంతవాక్యము పలికే స్థితిలో నున్నారు మీరు. సాహిత్యమును గురించి ఎవరేది వ్రాసినను వారిని విమర్శకులని - వారి వ్రాతలు విమర్శలని అనుకొను స్థితిలో నేను లేను.

నేను చేసిన విభజన బాగులేదని మీరు విమర్శకులను షడ్వర్గాలుగా విభజించినారు అరిషడ్వర్గము వలె. దశేంద్రియముల వలెను విభజింపవచ్చును. ఏమైనను మీ విభజనముతో నాకు నిమిత్తము లేదు అసలు విమర్శకులను రకములవారిగా విమర్శించుటనే పెట్టుకొన్నవాడను గాను నేను. ఈ విషయము నా తరువాతి వ్యాసములలో తమ ఎరుక కందియే యుండును.

"ఒకే గ్రంథంపై ఎందుచేత" ఇద్దరు విమర్శకులు "పరస్పరం విరుద్ధాభిప్రాయా లిస్తున్నారు? అన్న ప్రశ్న ఎక్కడా ఆలోచించలేదు" "లాక్షణిక మార్గం యొక్క ఆంతర్యమునుగురించి శాస్త్రిగారు కూడా ఎక్కడా చెప్పలేదు" ఇత్యాది అభిప్రాయాలను మీరు వెలిబుచ్చినారు. ఆ వ్యాసము తప్ప ఇకేమియు నేను వ్రాయబోవుట లేదన్న విశ్వాసముతో నట్లన్నారు. ముఖ్యముగా పైన మీరిచ్చిన

అభిప్రాయాలకు సమాధానాలు నా తరువాత ప్రచురింపబడిన వ్యాసాలలో నున్నవి. ఆ శీర్షికను ఇంకను వ్యాసములు ఎప్పుడో వ్రాయగలను. వ్రాయగల ననగా ప్రచురింప గలనని యర్థము. ఒక వ్యాసములోనే సర్వవిషయము లుండునన్న భ్రమతో, ఇకమీద వచ్చు వ్యాసములను కూడ చూడవలయునన్న ఓర్పులేక, తొందరపడి మీ రనేక విషయములు వింతవింతగా వ్రాసినారు. అన్ని విషయము లొకే వ్యాసమున వ్రాయకపోవుట నా పొరపాటని మీరు భావించుచున్నచో, మిగిలిన విషయములను భావించు పద్ధతిలోనే మీ యీ భావనగూడ ఉన్నదనుకొటకంటె నేను చేయగలి గిన దేమియును లేదు.

అసలు మీ ధోరణినిబట్టి చూడగా ఒక వ్యాస మునుగాని, ఒక సిద్ధాంత గ్రంథమునుగాని, ఒక కావ్యమునుగాని అఖండార్థప్రతీతి కలుగుట నెరిగి పతదపేక్షయా చదువుకొనుట మీరు చేయరని స్పష్టపడుచున్నది. పరస్పరము భిన్నములట్లు కన్పించు వాక్యములను సంఘటితపరచి, వివిధార్థ ములను స్ఫురింపజేసి, వాటి నన్నింటి ఏకవాక్యతకు లాగి అఖండార్థమును ప్రతీయమానమగునట్లు చేయుట; విరుద్ధరసముల సంయోజనచేత అంగి రసమును కావ్యార్థముదృష్ట్యా పుష్టముచేయుట. మొదలైన సంప్రదాయములు తమకు తెలిసినట్లు లేవు. హడ్సన్ మహాశయుని గ్రంథము మన రచనా సంప్రదాయములను చెప్పదు. ఓపికతో భగవద్గీత భాష్యమునైనను చదివినచో వాదము పద్ధతి తెలియును. పూర్వపక్ష సిద్ధాంతములతో అది ఎట్లుండునో తెలియును. దీనికితోడు తమకు తెనుగు వాక్య మర్థమగునట్లులేదు. "పరంపరగా వచ్చు చున్న లాక్షణికమార్గ మతనికి తెలియును. ఆ మార్గముయొక్క ఆంతర్యము తెలియనక్కర లేదు." అని నేను వ్రాసితిని. తెలియనక్కరలేదన్న దానినుండి "ఆంతర్యము గూడ తెలియవచ్చునని ధ్వని"ని మీరు పుట్టించినారు. మీ యిష్టమువచ్చిన చోట, ఇష్టమువచ్చిన విధముగా ధ్వని పుట్టదని మనవిచేయుచున్నాను. తెలియనక్కరలేదనగా ప్రకరణమునుబట్టి తెలియదని నిష్కర్ష. ఒకనికి చేతికెదిగిన కొడుకున్నాడు. వా డక్కరకురాక, తండ్రిమాట వినక, గాడెద్దువలె తిరుగుచున్నాడు. తల్లిదండ్రులు కుళ్ళిపోవుచున్నారు. ఒకనాడా యింటావిడ ఆయనతో అన్నది. "చెట్టంతకొడుకుండి వాడేమియు సంపాదించుటలేదాయె. ఇంకను మీరట్లు కష్టపడవలసివచ్చె" అని. ఆయన అన్నాడు "వాడికేమే. వాడు సంపాదించనక్కరలేదు" అని. ఆయన అన్నదాని యర్థమేమి? "వాడు భ్రష్టుడు. చెడబుట్టినాడు. వాడు సంపాదింపడు. మనకు పెట్టడు. బ్రతికినంతకాలము నేనిట్లు చావవలసినదే" అనియా? లేక నిజముగా తన కొడుకు సంపాదింప నక్కరలేదనియా? రెండవదే ఆ తండ్రి తాత్పర్య మని ధ్వనివేత్తలైన మీకు స్ఫురించును. ఒకడు భగవద్గీత విప్పినాడు. "బుద్ధౌ శరణ మన్విచ్ఛ"యని కనిపించినది. వానికి "బుద్ధం శరణం గచ్ఛామి" స్ఫురించినది. భగవద్గీతలో బౌద్ధమతము చెప్పబడిన దని వ్రాసినాడు. వాని నెవరు మాత్ర మేమి చేయగలరు?— ధ్వని యన నేమో తెలియ వలయును. వాదము తెలియవలయును. వాద పద్ధతి తెలియకుండ మీరు కవితాశక్తి - విమర్శనా శక్తి అన్న విషయమై నావ్రాసినది తల్లక్రిందుగా చూచినారు. ఉత్తరోత్తరము బలీయమన్న శాస్త్ర పద్ధతి నెరుగక తమరు "కవితా విమర్శన శక్తులలో ఏది గొప్ప అన్న ప్రశ్న ముదయింపదు. అవి రెండును అన్యోన్య మాధారాధేయములు" అని చివరకు నేను వ్రాసినదానియందు తాత్పర్యమును కుదుర్చుకొనలేక, మధ్య మధ్య వాదము కొరకు నేను "విమర్శనా శక్తికన్న కవితాశక్తి గొప్పది, నిజము. కవితాశక్తి గొప్పదే" అని వ్రాసిన ఇటువంటి వాక్యములను చూచి అవే సిద్ధాంతము లని భ్రమపడి, చివరకవి పూర్వపక్షము చేయబడగా నే ననాలోచితముగా ఉబుసుపోకకు వ్రాసినట్లు

సెలవిచ్చినారు. "విమర్శనాశక్తికన్న కవితాశక్తి గొప్పది" ఈ వాక్యము పూర్వపక్షిది. సిద్ధాంతి నిజము, కవితాశక్తి గొప్పదే అని తత్కాలమున అంగీకరించి, 'అయితే' అని వాదము ప్రారంభించుచున్నాడు. ఈవాదము ముగియువరకు పూర్వపక్షము పరాస్తమగును. అది ఒక విధమైన సాంప్రదాయికమైన రచన. అందుకే భగవద్గీతా భాష్యమైనను ఒకసారి చదువవలసినదిగా తమను కోరినాను.

"విమర్శనాశక్తియు-కవితాశక్తియు ఒకవ్యక్తి యందుండుట సంభవ"మని నేను వ్రాసినది తమకు బోధపడినట్లులేదు, నా వాక్యమిది. "ఒకప్పుడీ రెండును ఒకే వ్యక్తియందు సమపాళ్లలోనుండ వచ్చును. సవ్యసాచివలె అతడు రెండింటిని ఉచిత రీతి నిర్వహించును. అట్టివాడు కారణ జన్ముడు." మీరు దీనిమీద "ఇక్కడ సమపాళ్లకు అర్థమేమిటి? నూటికి 50 పాళ్లు కవితాశక్తియు, 50 పాళ్లు విమర్శనాశక్తియు కలిగివుండుట అని అర్థం" అని వ్రాసినారు. అది కాదు దాని యర్థము. అంతకు పూర్వ వాక్యమున నూరు అన్న ఒక పూర్ణ సంఖ్యను గ్రహించినట్లు నేనీ వాక్యమున గ్రహింప లేదు. మీరు చెప్పుచున్న 50 పాళ్లదియు 50 పాళ్లిదియు నన్నది నేను నూరును గ్రహించినపుడర్థ మగును. నేనట్లు గ్రహింపలేదు. అందుకే సమ పాళ్లలో అని వ్రాసినాను గాని సగమది సగమిది యని వ్రాయలేదు. నేను వాడిన సమ శబ్దమును మీరు సగముగా గ్రహించినారు. సమము - సగము అన్న శబ్దములు రెండును ఒకే యర్థమును బోధింపవు. ఏ శబ్దమున కెంత యర్థముండునో, ప్రకరణమును బట్టి ఎంత గ్రహింపవలయునో తెలియక వ్రాయుట క్షమింపదగినదిగాదు. సమ మనగా అది ఎంతో ఇది యంత యని అర్థము. నేను వాడిన సవ్యసాచి శబ్దార్థమును తమ కెక్కలేదు. మీ లెక్కప్రకారము సవ్యసాచి - యనగా సగము బలము కుడిచేతియందు సగము బలము ఎడమచేతియందును కలవాడు కావలయును. గాండీవమును సగము కాలము కుడిచేతితోను - సగము కాలము ఎడమచేతితోను ఉపయోగించుకొనువాడు కావలయును. సవ్యసాచి శబ్దమునకు మీరనుకొన్న యర్థము లేదు. "ఉభౌమే దక్షిణౌ పాణీ గాండీవస్య వికర్షణే తేన దేవ మనుష్యేషు సవ్యసాచీతిమాం విదుః" అని అర్జునుడే చెప్పికొన్నాడు. గాండీవ వికర్షణమున రెండు చేతులును నేర్పుకలవియని యర్థము. అనగా లోకమున సామాన్యముగా ఒక చేతియందే దునుర్వికర్షణ శక్తి యున్నదనియు అర్జునియం దట్టి శక్తి రెండవ చేతియందును నున్నదని. అనగా వాని రెండు చేతులయందును బలము సమముగా నున్నదని. వాడు ఏ చేతి నుపయోగించునపు డదే వాని బలముయొక్క సర్వస్వమట్లయినదా అని అనిపించునట్టి స్థితి యన్నమాట. అట్లే నేను చెప్పిన కారణ జన్ముడైన వ్యక్తియు. అట్టివా డుచితరీతిని రెండింటిని నిర్వహించునని నేను వ్రాసితిని. ఉచిత రీతి కూడ తమ కెక్కలేదు. ఉచిత మనగా తగినదని. దేనికి తగినది? ఏ పనిచేయు నపుడు దానికి తగినదని. అనగా విమర్శన వ్రాయు నపుడు దానికి తగిన పరాంకోటిశక్తియనియు, కవిత వ్రాయునపుడు దానికి తగిన పరాంకోటి శక్తియనియు అర్థము. మీ రనుకొన్నట్లుగా నుభయ భ్రష్టుడుకాడు. ఉభయభ్రష్టుని కారణ జన్మునిగా సవ్యసాచి శబ్దముపమానముగా చెప్పునంత అజ్ఞానములో నేను లేనని విన్నవించుచున్నాను. ఒక వాక్యములోని ఏ శబ్దమున కెంత యర్థము పుట్టి ప్రకరణమును ప్రకాశింపచేయగలదో తెలిసికొనుటకు కొంతకాలము పరిశ్రమచేయ వలసియున్నది. ఎంతకాలము చేసినను అది సమ గ్రముగా తెలియని స్థితి లోకమున నుండగా అసలేమియు చేయక, అది తప్పు అనుట ఎట్లు కూడును? సమగ్రముగా తెలియదని తెలిసిన దానికొరకై యత్నముచేయుట ఏల వలయును?

అన్నచో విష్ణుచిత్తులైన వారిని పరమేశ్వరుడే ఏమైనను చేయవలయును.

"కవి కాలేనివాడు విమర్శకుడవుతున్నాడనో, విమర్శకుడు కాలేనివాడు కవి అవుతున్నాడనో అనటం అది అశాస్త్రీయం" అని సెలవిచ్చినారు మీరు. నేనా అశాస్త్రీయమైన విషయమును ప్రతి పాదించినట్లు చూపించినారు. "కవులుగా కాలేని వారు విమర్శకులగుదు" రనుట, "విమర్శకులుగా కాలేనివారు కవులగుచున్నా" రనుట రెండును "పరమమైన చవుకబారు అభిప్రాయము" లై "అవివేక మూల"ము లగుచున్నవని నావ్యాసమున నేను వ్రాయనే వ్రాసితిని. నేను వ్రాసినది వ్రాయ నట్లుగా కప్పిపుచ్చుట, తమరేదో శాస్త్రీయమైన విషయమును వ్రాయుచున్నట్లుగా కనిపించుటకు యత్నించుట యుచితములు కావు.

మీరు వ్రాసిన అంశములు రెండు. ఒకటి శ్రుత అశ్రుత విమర్శకులన్న విభజన సరిగాదని. రెండు కవితాశక్తి విమర్శనాశక్తులను గురించి నేవ్రాసినది పూర్వాపరవిరోధముగా నున్నదని. విభజనను గురించి నేనంత గట్టి పట్టుదల కలవాడనుకాను. ముఖ్యముగా శ్రుత-అశ్రుత శబ్దముల ఉపయోగము నందు. ఇక రెండవవిషయము. పూర్వాపరవిరోధ మందేమియు లేదు. వాదము పద్ధతి యటుండుట దేశీయమైన సంప్రదాయము. అది మీకు తెలియ దేమో! పైగా మీకు ప్రతివాక్యములోను ఊరక విపరీతపుధ్వనులు వినిపించుచున్నవి. అందువలన ధ్వని స్వరూపమును మీకు తెలియదని ఊహింప వలసివచ్చుచున్నది.

కేతవరపు రామకోటిశాస్త్రి.

**FORM IV**

1. ౫౧౬, సుల్తాన్ బజార్, హైదరాబాద్ నుండి ప్రకటింపబడును
2. మాసపత్రిక
3. *ప్రింటర్ :* జువ్వాడి గౌతమరావు, సుల్తాన్ బజార్, హైదరాబాద్
4. *పబ్లిషర్ :* do
5. *సంపాదకుడు :* do
6. *భాగస్వాములు :* do

పై పేర్కొనబడిన విషయములు సత్యములని సూచించుచున్నాను.

జువ్వాడి గౌతమరావు

## గురజాడ అకవి?

గురజాడ రచనల్లో కవితాశక్తి సున్నా అని సీతారామరావుగారి విమర్శ.

గురుజాడ రచనలు చమత్కారానికనిగాని, కాలక్షేపానికనిగాని వ్రాసినవి కావు. భాషా పాండిత్యాన్ని ప్రదర్శించటానికి వ్రాసినవి కావు. జీవితంపట్ల, సమకాలిక సాంఘిక స్థితిగతుల పట్ల వున్న గాఢమైన స్పృహ - కవికుండే స్పృహ - ఆయనను కవితవైపు తిప్పింది. ఆయనలో కవితను పల్కించింది. కవితకు బీజమైన దర్శనం ఇది. ఈ దర్శనం సంగతి విమర్శకుల కవసరంలేకపోయినా, మనం ఇదివరకు వివరించిన కవిత్వతత్త్వాన్ని బట్టి మాత్రం అత్యవసరం. కాబట్టి ముందుగా దీనిని పేర్కొన్నాము. ఇక ఈ దర్శనపు బాగోగుల ప్రసక్తి ఇప్పుడు కాదు. ఈ దర్శనాన్ని, స్పందాన్ని తగినంత భావనామయం చేసుకొని ప్రకటించ గలిగాడా అనేది ఇక విచారిద్దాం.

ప్రకటనాశక్తి విషయంలో విమర్శకులు సరిగా ప్రమాణాలను నిర్దేశించి, అన్వయించలేదు. కవితాముద్ర సర్వత్ర భాసించాలి అని అంటారు. కాదని ఎవరంటారు? కాని కవితాముద్ర అంటే ఏమిటి? జవాబులేదు. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీగారలను పేర్కొని గురజాడతో పోల్చారు. మొదటి వారికి మెత్తగా చెప్పేశక్తి ఉన్నదని, అది గురజాడలో మృగ్యమని అన్నారు. అలాగే రెండవ వారికి శబ్దవిన్యాస తీవ్రతవున్నదని, అది గురజాడలో శూన్యమన్నట్టు తోపజేశారు. "కవియైన వానికి వస్తువు ముందు భావనామయమైగాని రచనగా పరిణమించదు. అ కవియైన వానిలో వస్తువు భావనా స్పర్శలేకుండనే ఉన్నది ఉన్నపాళముగా రచనయగుటకు ప్రయత్నించును. గురజాడవారి రచన ఈ శ్రేణిలోనిది" అన్నారు. ఈ నిర్దేశం విషయానికి కొంత దగ్గరగా వచ్చింది. కాని ఇదీ ఒక సూక్తిగానే వుండిపోయింది.

విమర్శకులు వేలెత్తి చూపిన లోపాల సంగతి చూద్దాం. గురజాడ రచనలో అసలు మెత్తదన మనేది వుందా? అని ప్రశ్నించారు. గురజాడ కవితను చదివేప్పుడు అడుగడుగున ముందు స్ఫురించేది ఈ మెత్తదనమేనే!

"ఇహము లోపలి మంచి యంతయు
యిమిడియున్నది దీని ఆత్మను;
ముక్తికాంతై తుదకు నీకిది
ముందుగతి చూపున్"

—లవణరాజు కల

"కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేనిపసల్!
హంసలజేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ"

—పూర్ణమ్మ

పై రచనలల్లో మెత్తదనమా ఉన్నది లేక "రచనా శైథిల్యమా?" ఇది మెత్తదనము కాక పోతే మరేమిటి?

గురుజాడలో కనిపించేది భావములు శబ్దముల కందని ప్రథమావస్థయని విమర్శకులు. భావానికి శబ్దానికి మధ్య విమర్శకులు గాని, అభిమానులు గాని కష్టించి పూడ్చవలసిన అఖాతమేమీ, దూర మేమీ పై రచనల్లో గోచరించటం లేదే?

ఆ మాటలు తెలుగు మెత్తదనానికి తేనెపట్లు. వాటిలో పారుష్యం ఏది? ఇంకా ఎన్నయినా ఉదాహరించవచ్చు. కాని మెతుకు పట్టుకుంటే చాలుకదా!

ఇక శబ్దవిన్యాస తీవ్రత గురించి:

ప్రకటనా శక్తికి ఇవీ రైలు పట్టాలని కచ్చితంగా చెప్పటం అసాధ్యం. ఒకరికి శబ్దవిన్యాస తీవ్రత తోడ్పడుతుంది. మరొకరికి శబ్ద నిరాడంబరం తోడ్పడుతుంది. నిజానికి పైన చెప్పిన మాటల మెత్తదనం విషయంలో కూడా అంతే. కేవలం మెత్తని మాటలతోనే కవిత్వానికి శక్తి రాదు. ఒకడికి మెత్తదనంతో శక్తివస్తే, మరొకడికి కరుకు

దనంతో వస్తుంది. గురజాడ రచనను మరొకరి రచనతో మొత్తం అనుభూతి విషయంలో పోల్చ వచ్చునే గాని, శైలి తదితర వివరాలతో పోల్చి తేల్చటం తప్పు. మరొక రచయిత కున్న మెత్త దనం లేదే అని, అలాగే మరొకరి శబ్దవిన్యాస తీవ్రత లేదే అని వాదించటం పొరబాటు. కవిత్వపు సృజనాత్మక శక్తిని, దాని వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేకపోవటం అది. అయినా గురజాడ వాడిన భాషలో అట్టి విన్యాసం తగు మోతాదులో కనబడుతూనే వుంటుంది.

"కపట మౌనిఁ జూచి కన్నియఁ జూచుచు
గన్నెఁ జూచి కపట మౌనిఁ జూచి
చిత్త మరలర దలఁచెఁ జిత్తజజనకుండు
నేఁడు గంటి నలువ నేర్పటంచు"

—సుభద్ర

"పైటపైఁ దూగాడు పచ్చలహారముల్
చలదింద్రచాపంబు చాడ్పుఁజూప"

— సుభద్ర

"మతివీణ మీటునంతనె
ఋతతంత్రీ శ్రుతిని జేరి యింపుగ స్వరముల్
ప్రతి సంవాద మ్మిడునని
సతతము..."

— ఋతశతకము

"స్మితమతి సూచీ భేదిత
ఋత మౌక్తికపదకశతక మిభపతి భాషా
సతి కతికుతుకత గూర్చగ
సతతము..."

— ఋతశతకము

"ముదుసలి మొగడుకు ముడివేస్రీ"

— పూర్ణమ్మ

ప్రకటనా శక్తికి తగ్గిపోని శబ్దవిన్యాసం గోచరం అవుతూనేవుందే!

ఇక వస్తువు భావనామయమై యుండుట గురించి :

"పసిడికడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్ళు పువ్వులు
మోములందున మొలక నవ్వులు
చెలగి చెలికత్తెల్ వెంటనడిచిరి."

"ఔర! చుక్కలనడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నెముందర,
వన్నెగాంచిన నగరినుందరు
లందరొక లెక్కా ?"

—కన్యక

గురజాడ కవితా శిల్పం గురించి :

"ఏయే వేళల పూసేపువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.
ఏయే ఋతువుల పండేపళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.
పళ్ళను మీరిన తీపులనీడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు
సొరులు మించెను నానాటన్"

—పూర్ణమ్మ.

మరి వీటిలో "వస్తువు భావనాస్పర్శ లేకుండనే యున్నది యున్నపాళముగా రచన యగుటకు" ప్రయత్నించలేదే ? "వస్తువుముందు భావనా మయమై" రచనగా పరిణమించలేదా ?

ఇక ప్రసిద్ధమైన దేశభక్తి గేయంలో కవిత్వపు జీరకూడా లేదన్నారు విమర్శకులు. కవితాముద్ర పడలేదన్నారు. చూద్దాం :

"దేశమనియెడు దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి
నరుల చమటను తడసి మూలం
ధనం పంటలు పండవలెనోయి !"

"చెట్ట పట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి;"
"దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి!"

"అభ్యుదయకరమైన భావములలో దీనికి స్థానమున్నదేమో నాకు తెలియదు కాని, కవిత్వములో లేదు." అని అన్నారు విమర్శకులు.

గురుజాడకున్నవి పరతంత్ర భావములేయని అంతకు ముందే ప్రకటించి వున్నప్పుడు, ఈ గేయానికి అభ్యుదయకరభావాల్లో మాత్రం స్థానంవుందేమోననేది తెలియదనటం మట్టుకు దేనికి ?

గురజాడ కవే కాదన్న తర్వాత ఇక ఆయన ఆధునిక సాహిత్యానికి యుగపురుషుడవునా కాదా అని విమర్శకులు శంకించినట్టు కనిపించి చివరకు కాదని తేల్చటం ఎందుకో ? గురజాడలోని యుగ కర్త లక్షణాల గురించి పరిశీలించటం వారికి ఇక్కడ అనవసరం.

ఇక గురజాడ కవితలోని విశిష్టత గురించి: నూటికి నూరు పాళ్లు తెలుగుతనం వీరి కవితది. కవిత్వంలో ధారవుంది. భావన ఉంది. స్పష్టత ఉంది. మృదుత్వం ఉంది. డొంక తిరుగుడులేదు. భావం, చదివిన తక్షణం హృదయానికి చేరుతుంది. భాషలో బిగువుంది. ఒక్క మాటలో తెలుగు కవి అక్షరాలా. అసలిక్కడే వుంది కీలక సమస్య. కవితాప్రతిభ అన్నామే దానిని గురజాడ విషయంలో ఈ తెలుగుతనం, తెలుగు భాషా భావనా సంప్రదాయాలను విస్మరించకుండా ఎంచాలి. రచయిత తాను చెప్పదలచుకొనే దానిని చదివేవాడి హృదయానికి హత్తుకొనే అట్టు అక్కడ సమస్పందాన్ని కలిగించేట్టు కవిత్వం వ్రాయ గలగటం కవితా ప్రతిభ. ఏ శక్తి మరి కన్యక రచనలో గుండెను కలియపెట్టుతోంది ? ఏ శక్తి మరి పూర్ణమ్మ గాథ వింటుంటే గుండెను ద్రవింప జేస్తుంది ? ఏ శక్తి మరి దేశభక్తి గేయంలో ఉత్తేజం కలిగిస్తోంది ?

పద లాలిత్యం. శబ్దాలంకారం, అర్థాలంకారం, ఉపమానాలు వగైరాల క్రింద విభజించిచూచినా గురజాడ రచన దీటుగా ఉందే?

మొత్తంమీద అనుభూతి, విడివిడిగా శాస్త్రీయ పరిశీలన, రెండింటి దృష్ట్యాకూడా గురజాడ కవి అవటమేకాక, విశ్వకవుల కోవితో నిలబడగలిగిన మహాకవి అని తెలుసుకొన[illegible]గుతాం. ఆయనది రసపూరిత హృదయం. మే[illegible]న్న హృదయం, జగత్తును మనుష్యుడిని బింబప్రతిబింబాలుగాగోచరం చేసే కవితా దర్శనం వారిది. అందుకు తగినవర్ణనా శక్తి ప్రతిభ వారి ప్రత్యేకత.

—హంస

# రాజరాజేశ్వరా !

ధూళిపాళ శ్రీరామమూర్తి

కాకన్ క్రమ్మగ్గిరి చిత్తవీథి ప్రభువై కారుణ్యపాథోధివై
సాకన్ రమ్మిక పల్లవారుణజటాసంతాన సంతానవృ
క్షాకారుండవు నీ సుశీతల తనుచ్ఛాయాభిరామంబుగా
స్వీకారం బొనరించి నా హృదయమున్ శ్రీరాజరాజేశ్వరా !

మోళీకట్టి పణంబువెట్టితిని నీ మూలంబుగా బ్రాణమిం
దాలంబైనది పాప పంక్తులవియున్ హల్లీసకం బాడెడిన్
లీలన్నిద్దుర వోవుచుంటి విది మేలే ? మేలుకో మేలుకో
వేళయ్యెన్ శ్రమయయ్యె గెల్చికొనరావే ! రాజరాజేశ్వరా !

కామక్రోధము లివ్వి బట్టినవి బల్గాముల్ ననున్ వీనిలో
స్వామీ కొంచెము క్రోధమేమెరుగు తా బాధించు నెప్డో మఱీ
కామంబన్నది నిత్యమేర్చెడి మహాకాలానలజ్వాలయై
సీమంతప్రసవాయితైందవకళా ! శ్రీ రాజరాజేశ్వరా !

ఏమో యిమ్మని కోరనయ్య ప్రభువా ! యేమూలొ గూర్చుండి నీ
శ్రీమద్దివ్య విభూతిమానసమునన్ జింతింపఁగా నెంతు ; నా
కీమాత్రంబును జేసిపెట్టు పదివే లిప్పించి నట్లెంతు ని
స్సీమానందతనూవలక్షసుషమా ! శ్రీరాజరాజేశ్వరా !

వాకోరానిది యూహకందనిది నీ వాల్లభ్య మట్లౌటచే
వాకాడన్ మనసాడ నీ సొగసు సంభావింపగావచ్చునే ?
మూకీభావము చెంద వాఙ్మనసమున్ మోహంబు ద్రుంగన్ ననున్
శ్రీకళ్యాణపథమ్మునన్ నిలుపవే శ్రీరాజరాజేశ్వరా !

ఇదియేదో యటవీ ప్రయాణమున నిందీమార్గమే మార్గమై
బదమేమున్నది ? యేదొ పట్టుకొని పోవంబోవ నే పల్లెయో
పదడో వచ్చుననంగ గమ్యమగుచుఁ బాలించుచందాన, నీ
వెదురై రావలె నాదుకోవలెను తండ్రీ! రాజరాజేశ్వరా !

మధురంబైనను నాల్క సాచదటె! రమ్యంబైన గన్గూడదే
యెదురై పిల్చిన నేనియుఁ వినద యొక్కింతైన శ్రోత్రంబు దా
నిదురంబోయెడి నింద్రియాళి యెడదఁ నిఁ సుంత భావించుచో
గుదురై నిల్చితివేని యేమగుదు నొక్కో ? రాజరాజేశ్వరా !

కుదురై గుండియలోన నూగిసలుగా కూర్చుండు తా వేదనా
వధియై యూరక లోన త్రవ్వుకొనుచుఁ వచ్చుం దరంగమ్ములై
గదియుం గన్నుల గంతమందు సుడియుఁ గాంభోజి నోటాడెడిఁ
మృదునాదమ్ములు వాకలై విరిసెడిఁ శ్రీరాజరాజేశ్వరా !

నాలో నే గుడుసుళ్లు చుట్టుకొనుచున్ నాలోన నేనూగుచున్
నాలో నేను దరంగితమ్ము నగుచుఁ నాలోన నే బొంగుచుఁ
ఆ లోలోపల నేమియో మిలమిలై యంతంతలో వెన్నెలై
మేలై పోవలె : మేలుకోవలెను స్వామీ ! రాజరాజేశ్వరా !

ఆలంబంబుగ గావ్యమార్గమున నిన్నారాధనం జేయుచో
ఆలానంబయినాడ నేమి దయయో ! ఆనందమూర్తీ ! శివా !
కైలాసంబయి పోవజేసికొనవే ! కామారి ! నాచిత్తముఁ
లీలాబాలసుధాంశు పాలిత జటాలీ! రాజరాజేశ్వరా !

ఆయుర్దాయము కల్గునంతకును నీపైభక్తి, నీ భావనా
ధ్యాయత్వంబును నీ సమాధియును నీ బోధామృతాస్వాదముఁ
జేయంజూడుము, పైననామయము నిశ్శ్రేయఃపదం బిమ్ము ; వే
ఱే యైశ్వర్యము నొల్లనయ్య ప్రభువా ! శ్రీరాజరాజేశ్వరా :

విశ్వనాథ సత్యనారాయణ

# అభిజ్ఞాన శాకుంతలము

## 6

భారతములోని కథను కాళిదాసు మార్చుటను గూర్చి మున్ను చెప్పబడినది. ఇందు ప్రధానమైన మార్పు దుర్వాసుని శాపము. ఈ ఒక్క శాపముతోడనే కాళిదాసుని కథయంతయు మారిపోయినది. భారతములోవలె దుష్యంతు డెచ్చట నబద్ధమాడినవాడు గాలేదు. తన మనస్సులో తనకుఁ దెలిసిన విషయమును ప్రకృతిజనులవలని భయమువలన దాచికొని వృథావిడంబనము చేయలేదు. ధీరోదాత్తుడైన నాయకుడైనాడు, కాళిదాసుని దుష్యంతుడు ప్రకృతిజనులవలన భయపడువాడు కాడు. ఆయన రాజర్షి. అంతఃకరణ ప్రవృత్తి నిత్య జాగ్రదవస్థయందున్నవాడు. ఆయనకట్టి భయములేదు. అతడు మహర్షి కల్పుడు. అందుకనియే 'సాక్షాత్ప్రశ్యామీవ పినాకినమ్' అని సూతుడనుట. ఈ భావమే సర్వజనులయందు వ్యాపించి యున్నది.

భారతకథలో నైదారేండ్లు దాటిన సర్వదమనుని వెంటబెట్టుకొని శకుంతల భర్తృదర్శనార్థము వెళ్ళినది. ఆరేండ్ల కాలములో దుష్యంతు డీ కథను మరచిపోయినను మరచిపోయి యుండవచ్చును. ఇచ్చట నట్లు కాదు. శకుంతల భర్తయొద్దకు పోవువరకు నెలలుకూడ నిండలేదు. నాలుగైదు నెలల గర్భవతి కావచ్చునేమో. ఈ యయిదు నెలలలోనే మరచిపోవుట కెక్కువ సావకాశము లేదు.

మొదటి కారణము నాయకుని ధీరోదాత్త లక్షణము. నమృషావాదిత్వము సంపాదించుటకు కల్పింపబడిన శాపము. రెండవ విషయముచేత శాపముయొక్క గాఢ లక్షణము సమర్థింపబడినది.

ఈశాపము హఠాత్తుగాసంభవించినదా? ఆకాశమునుండి యూడిపడినదా ? ఒక మహాకవి యెప్పుడును హఠాత్తుగా దేనిని ప్రవేశపెట్టడు. అట్లు ప్రవేశపెట్టుటచేత వేఱప్రయోజన మున్నచోఁ జేయవచ్చును. ప్రయోజనముకంటె నౌచిత్య ముండవలయును. ఇచ్చట నట్లుగాదు. శకుంతలకు దైవము ప్రతికూలముగ నున్నది. ఆ ప్రతికూలదైవమే ఈ శాపముగా పరిణమించెను. ఈసంగతినే రాజుచేత "అపి సన్నిహితో ఽత్ర కులపతిః" అని ప్రశ్నింపబడి, వైఖానసుడు "ఇదానీమేవ దుహితరం శకుంతలాం అతిథి సత్కారాయ సందిశ్య దైవ మస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః" అని చెప్పినాడు. ఈ రీతిగా ఆ శాపకథకు ప్రథమాంకమునందే, దుష్యంతుడు శకుంతలాదర్శనము చేయకముందే బీజనిక్షేపము చేసినాడు.

సరే ఆమెప్రతికూలదైవమును శమింపఁజేయుటకు సోమతీర్థమునకు కణ్వుడు వెళ్లెను. ప్రతికూలదైవము శమించునదేగాని పూర్తిగా నివర్తితమగునది కాదు. ఇది దైవముయొక్క లక్షణము. దాన జపాది శాంతికర్మలచేత ప్రతికూలదైవముయొక్క తీవ్రతను తగ్గించవచ్చును. దైవమును పరిహరించరాదు. కణ్వునంతటి మహర్షి దాని నుపశమింపజేయుటకుమాత్రమే సమర్థుడయినాడు.

ఆ ప్రతికూల దైవము యొక్క లక్షణమెట్టిది ?

ఈ నడుమ నొకానొక యాధునిక విమర్శకుడు అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతలా దుష్యంతుల వివాహమును గూర్చి యొక యాక్షేపము చేసినాడట. 'దుష్యంతుడు వయసుమళ్ళినవాడు. శకుంతల చిన్నది. ఇది అసమవయస్కుల నడుమ వివాహము. ఆధునికులకు రుచించదు' అని. మన యాధునికులకు పూర్వ గ్రంథములలో నున్నది ఏది రుచించుచున్నది గనుక

ఇది రుచించలేదన్న విచారము? మనదేశములో నొక నానుడిఁగలదు. 'ముప్పది యేండ్ల పురుషుడు, మూడేండ్ల యాడుది' అని. ఇది పూర్వుల భావము. దీనిలోని యాథార్థ్య మిచట చెప్పుట యనవసరము. లోకమును చక్కఁగా పరిశీలించినవారి కిదియే సమంజసమని తెలియగలదు. కౌంట్ టాల్స్టాయ్ కొన్ని చిన్న నవలలు గూడ వ్రాసినాడు. వానిలో 'ఫామిలీ హాపినెస్' అను నొక చిన్ననవలగలదు. ఆ కథలో తండ్రి చనిపోయిన యొక పదునారు పదునేడేండ్ల బాలిక తానే సంసారమునకు పెద్దదై తన తండ్రి స్నేహితుడొకడు తన్నుచూడరాగా నతనిని ప్రేమించి వివాహము చేసికొనెను. ఇట్టి సంయోగమునందు కుటుంబసౌఖ్యమున్నదని టాల్స్టాయ్ యొక్కఁ యుద్దేశ్యముగదా! ఆయన మహాత్మునకు గురువువంటి వాడు. అట్టి పరిణత మేధావంతుల యభిప్రాయముల నర్థముచేసికొనలేని యాధునికుల యూహలలోని సామంజస్యము వారికే తెలియవలయును. దీనిని వదలిపెట్టి మరియొక రీతిగా విచారణ చేసినచో, శకుంతల వయస్సు విచారణీయమగుచున్నది. ఆమె మేనకా విశ్వామిత్రుల సంతానము. మేనకా విశ్వామిత్రుల కథ యేనాటిది? ఈ కథ రామాయణమునందున్నది దుష్యంతుడు రామచంద్రునకు గూడ పూర్వుడా! శకుంతల వయస్సెంత? యెవ్వరికిని తెలియదు. ఆమె పూర్వయుగమునాటి స్త్రీ. రేవతీ బలరాముల సంబంధమువంటి సంబంధమిది. ఆధునిక చరిత్రకారుల లెక్కఁలనుబట్టి సర్దినచో సర్దవచ్చునేమో గాని, పురాణములయందున్న కథాక్రమమును బట్టి, కాలక్రమమును బట్టి, సర్దుటకు ఇది వీలులేని విషయము. దుష్యంతుని వివాహము చేసికొనువఱకు నామెయొక్కఁ బాల్యావస్థ బాల్యావస్థగానే యుండునన్న వరము నామె కెవరైన ననుగ్రహించిరో, దుష్యంతుడామెను చూచునాటికి నామెకు సుమారు పదునారేండ్లున్నవనుకొన్నచో బదునారేండ్లకు పూర్వమే కణ్వుడు పసిబిడ్డగానున్న శకుంతలను మేనకచేత పరిత్యక్తయైన స్థలమునందు చూచెను. అనగా కొన్నివేల యేండ్లు - వేలయేండ్లేమి లక్షల యేండ్లు శకుంతల శిశువుగానే అచ్చట పడియుండెనని యర్థము చెప్పుకొనవలయును. దీనినిబట్టి విచారించినచో, పూర్వకథ లాధునిక విమర్శనా సూత్రముల కందవు. ఇదంతయు నిట్లున్నను, శకుంతలయొక్కఁ ప్రతికూలదైవము చక్కఁగా కన్పించుచున్నది. వెనుకటి యుగములో జన్మించి యొక ఋషికి దొరికి యెన్నివేల యేండ్లో కన్యగానుండి వివాహముకాక యున్న విచిత్రమైన యొక జీవి శకుంతల. ఆమె గర్భమున నొక మహాపురుషుడు పుట్టవలయును. అతనిపేర నీ దేశము పిలువబడవలయును. ఆమె కారణజన్మురాలు.

ఇన్ని యేండ్లనుండి తన యాశ్రమమున నున్న శకుంతల యొక్కఁ ప్రతికూలదైవము నుపశమింపజేయుటకు కణ్వుడు సోమతీర్థమున కిప్పుడే యేల వెళ్ళినాడు?

ఆమెకు దైవము ప్రతికూల మిప్పటినుండియా? వేల యేండ్లనుండి. కణ్వుడు మహర్షి. భగవంతుడు. అనగా ఆగతానాగతాదుల పరిజ్ఞానము గలవాడు. శకుంతలకిప్పటికి దైవమనుకూలమైనది. వివాహము జరుగు వేళ వచ్చినది. కాని కొంత ప్రాతికూల్యమున్నది. ఆ ప్రాతికూల్య ముపశమింపజేసినచో నామె సంసారము సుఖముగా నుండును. కణ్వుడు తొందరపడినాడేమో చెప్పలేము. మరి యైదేండ్లాగినచో నీ ప్రాతికూల్యము గూడ నుండెడిదిగాదేమో. ఉపశమింపచేయ నక్కఁరయే యుండెడిదిగాదేమో. శకుంతలాజాతకముతో కలిసి మరియొకని జాతకమున్నది. అతడు జన్మించబోవు భరతుడు. అతడు తొమ్మిది నెలలలో జన్మించితీరవలయును. అతనికైదేండ్లు వచ్చువఱకును తల్లి జాతకము బాగుగా లేదు. అప్పటికైనను బాగుపడదేమో. కణ్వుడు సోమతీర్థమునకు వెళ్ళి దాని నుపశమింపజేసెను. అందుచేత నైదేండ్లలో బాగుపడినది.

ఇప్పుడు శాపప్రసక్తి. ఆపద లనేకవిధములుగా వచ్చును. అవి యిట్లు వచ్చునని యెవ్వరికిని

తెలియదు. గ్రహచారము నెవ్వరును మార్చలేరు. శకుంతల యొక్క జాతక మట్టిది. ఆమెకు మంచి దినములు. వివాహమై గర్భవతి కావలసిన రోజులు. వెంటనే భర్తృవిరహము. అయిదారునెల లైన తరువాత సంబంధమే విచ్ఛిన్నమైనదా అన్న స్థితి నాలుగై దేండ్లు. అప్పటినుండి యథార్థముగ మంచి దినములు.

ఇది యామె జాతకము. కొడుకైన భరతునకు సుమారు నాలుగై దేండ్లు వచ్చినతరువాత నామెకు మంచి దినములు. కణ్వుడు సోమతీర్థమున తద్దైవము యొక్క ప్రాతికూల్యము నుపశమింపజేయుట చేత జరిగినది. లేనిచో నా ప్రాతికూల్య మెట్లు బాధించెడిదో తెలియదు. శకుంతల సన్యాసిని కావచ్చును. ఆమె మరణించవచ్చును. భూవివరమునందు ప్రవేశించవచ్చును. మనకు తెలియదు. భరతుడు దుష్యంతునకు దొరకుట వేరు వార్త. శకుంతల చనిపోయినతరువాత మారీచమహర్షి భరతుని దుష్యంతుని వద్దకు పంపించి 'వీడు నీ కొడుకు, శకుంతలను నీవు తిరస్కరించితివి' అని చెప్పి పంపించియుండవచ్చును. అప్పుడు దుష్యంతునకు జ్ఞప్తి కలుగవచ్చును. దుష్యంతుడు భరతుని నిస్సందేహముగాస్వీకరించెడివాడు. భరతుడు చక్రవర్తిలక్షణోపపన్నుడు గనుక. దీని కీ క్రింది వాక్యములు సాక్ష్యములు. శకుంతలాతిరస్కారము జరిగిన తరువాత పురోహితు డిట్లన్నాడు గదా.

'అత్ర భవతీ తావ దాప్రసవా న్మమ గృహేతిష్ఠతు। కుత ఇద ముచ్యత ఇతిచేత్ త్వంసాధుభి రాదిష్ట పూర్వ ఏవ । ప్రథమం చక్రవర్తినం జనయిష్య సీతి । సచే న్మునిదౌహిత్రః, తల్లక్షణోపపన్నో భవేత్, తతః ప్రతినన్ద్య శుద్ధాంత మేనాం ప్రవేశయిష్యసి । విపర్యయే పితు రస్యా స్సమీపగమన ముపస్థిత మేవ.'

ఈ మాటలకు రాజు ' యథా గురుభ్యో రోచతే ' అన్నాడు.

అందుచేత శకుంతలకే దైవము ప్రతికూలముగా నున్నది. భరతునకుగాదు. దానినే కణ్వు డుపశమింపజేసినాడు. అదే కణ్వుని తపశ్శక్తి. పైగా ఆ కణ్వునకు శకుంతలమీద ఎంత ప్రేమ ? ఆమె నత్తవారింటికి పంపించుచు కన్నులకు నీళ్ళు తెచ్చుకొన్నవాడు. నోటమాట రానివాడు. కడుపున కన్న తండ్రు లెట్టి తనయావిశ్లేష దుఃఖముల ననుభవింతురో అంత యనుభవించినవాడు.

ఆ దైవము యొక్క ప్రాతికూల్యము చాల పెద్దది. హఠాదాపతితమైనది. మరియు శకుంతలా స్వభావ సముద్గతమైనది. పరమేశ్వరుడైన కాళిదాసు దైవమునకు వ్యాఖ్యానముచేసెను. భాష్యమును విరచించెను. దైవ ప్రాతికూల్యమనగా మనయంతట మనము చేసికొన్నది. శకుంతల దుష్యంతనివిష్టబుద్ధియై, వాకిటి ముంగిలికి వచ్చిన దుర్వాసుని చూడలేదు. నీ కామము ధర్మానుబంధిగా నుండవలయును. ఆమె యొక్క దుష్యంతగత చిత్తవృత్తి శృంగారరసమునకు దోహదము గాని తత్కాల సమాపతిత ధర్మాచరణ ప్రతిబంధకమైనది. ఇది సృష్టిలోని రహస్యము. ఇది ధర్మములోని రహస్యము. దైవము యొక్క రహస్యము. ఇవియన్నియు నొకదానియం దొకటి యను స్యూతములై యుండును. వానిని విడబఱచిచూచుటయు నాచరించుటయు ఋషులు చేయుదురు. తదితరులు కర్మాధీనులగుదురు. ఆ కర్మయే దైవము. ఇది వేద ధర్మ రహస్యము. దీనిని కాళిదాసు వ్యంగ్యముగా తన కథాంశముల యందు నిక్షేపించినాడు.

మరియు నిందింకొక్కవిశేషముగలదు. శకుంతల యొక్క పరధ్యానము, తత్ఫలితమైన శాపము, వాని యంతట నవి యప్పుడే సముద్భవించలేదు. శకుంతల పుట్టిననాటనుండియు నున్నవి. ఇదియంతయు ననాదినుండియు పూర్వ పూర్వోద్దిష్టమైనవై యుత్తరోత్తర కాల వికృతములై యుండును. అందుచేతనే, ప్రతికూలదైవము నుపశమింపజేయుట, కణ్వుడు సోమతీర్థమునకు వెళ్ళుట, మొదలయినవి పూర్వోక్తములైనవి. కాళిదాసు సర్వ వేదగత ధర్మకర్మ సమూహ రహస్య పరిష్కార సిద్ధాంతవేత్త. అందుచేత నీ కథ నిట్లు కల్పించినాడు.

ఈ దైవప్రాతికూల్యముయొక్క బలవత్తయెట్టిది? దాని కుపశమ మెంతవరకు జరిగినది? దాని లక్షణ మేమి?

దాని లక్షణ మెట్టిదనగా నది హఠాత్సంభవము కాదగినది. మిక్కిలి బలవత్తరమైనది. అందుచేతనే సులభకోపుడైన దుర్వాసు డతిథిగా వచ్చెను. అది యెంత బలవత్తరమైనదనగా, ప్రియంవద ఇట్లన్నది. 'యదానునీతోపి నివర్తితుం నేచ్ఛతి తదా విజ్ఞాతో మయా' అనునీతుడైగూడ తిరిగి రానన్నాడు. దైవ ప్రాతికూల్య మంతటిది. శాపము శాపముగా నుండి పోవలసినదే. ఆ దైవప్రాతికూల్య మంతటిది. కాని, కణ్వుడు దాని కుపశమనము చేసినాడు. ఆదైవ ప్రాతికూల్యమును ఆ యుపశమనమును కాళిదాసెంత విచిత్రమైన వ్యంగ్యముతో నిరూపించినాడు? ఆ దైవముయొక్క ప్రాతికూల్యముయొక్క యపరి హార్యత్వ మెంత విచిత్రముగా నిరూపించినాడు? అనసూయ దుర్వాసుని ప్రసన్నునిచేసికొనుటకు పూల గిన్నె తీసికొనిపోవుచున్నది. ఆమె కాలుజారి పూల గిన్నె క్రిందబడినది. పూలన్నియు విరియజల్లబడినవి. మరల నామె పూవులన్నియు ప్రోగుచేసినది. పూలు విరియజల్లబడుటతో శాపానుభవము తప్పదనియు, మరల ప్రోగుచేయుటతో శాపమునకు నిష్కృతి లభించుననియు నర్థములు. ప్రియంవద దుర్వాసుని దగ్గఱకుపోయి మరల తిరిగివచ్చినది. ఆమె యిట్లన్నది. 'ప్రకృతివక్రుడైనవాడు ఎవరుబతిమాలినను ఒప్పుకొనడు. కాని కొంచెము మెత్తబడినాడు' అన్నది. అప్పు డనసూయ 'ఆయన విషయములో నిదే గొప్ప. తరువాత చెప్పుము, చెప్పుము' అని।

ఈ ప్రసంగముచేత శకుంతలయొక్క ప్రతికూలదైవము కణ్వునియొక్క సోమతీర్థ గతోపశమన తపఃప్రభావముచేత కొంత తగ్గిన లక్షణము తెలియుచున్నది. అంతటి ప్రాతికూల్యమేదో కొంత తగ్గినది. అంతవరకేనరిపెట్టుకొనవలయునన్నమాట. దుర్వాసుడనుగ్రహించినాడు. 'నమేవచనమన్యథా భవితుమర్హతి । కింత్వభిజ్ఞానాభరణ దర్శనేన శాపో నివర్తిష్యతే' అని. కాని యీ యనుగ్రహలక్షణ మెట్లున్నది। 'ఇతిమన్త్రయన్నే వాన్తర్హితః' ఇచట రెండువిషయములున్నవి. అభిజ్ఞానాభరణ మొకటి యున్నదని దుర్వాసున కెట్లు తెలియును? అతడెందు కనెను? అతడును ఋషియే. ఆ ప్రతికూలదైవమే దుర్వాసోఋషిరూపమున వచ్చినది. ఈ యభిజ్ఞానాభరణ మా దైవమునకు తప్పకుండ దెలియును ఇది యొక విచిత్రమైన సృష్టి. ఈ ప్రపంచకము గిజిగానిగూడు. ఆ గూటిలక్షణము తెలిసికొని విరచించుట మహాకవిశక్తి.

అనుచునే అంతర్ధానము పొందినాడు. మరల నీ యంతర్ధానము పొందుటలో నర్థమున్నది. అంతర్ధానము పొందినాడు గనుక ప్రియంవద మరలనేదియో యడుగుటకు వీలులేదు. మాటలనుచునే యంతర్ధానమగుటలో నా యంగుళీయకము రాజునకు చూపించుటకు సులభముగానుండి, శక్రావతార తీర్థమున కన్పించకుండ పోయినది. హఠాత్తుగా పోయినది. తెలిసికోలేకుండపోయినది. 'మన్త్రయన్నేవాన్తర్హితః' అన్నదానిలో నీయర్థము.

-కొందరు కేరళప్రశ్నను చెప్పుదురు. ముఖ ప్రశ్నలు చెప్పుదురు. పృచ్ఛచేయువాడు నిలుచున్న వైఖరినిబట్టి, అడిగిన లక్షణమునుబట్టి, స్వరమును బట్టి, ముఖాది వికారములనుఁబట్టి ప్రశ్నలకు సమాధానముఁ జెప్పుదురు. ఆవేళయందు గ్రహసంపుటిని గుణించినను ఫలిత మదియేవచ్చును. ఇదివఱకు చెప్పితినిగదా. ఇవి యన్నియు నొకదాని కొకటి పెనవేసికొన్న విషయములని. ఈసృష్టిగతమైన, ఈ విలక్షణమైన పరిస్థితులను కావ్యములయందు రసదృష్టులైన మహాశిల్పులు విరచింతురు.

ఇది శకుంతలాదైవ ప్రాతికూల్యకథ.

# పరిణామం

మురయా

డాక్టరుగారికి ఎదురుగా కూర్చుని ఏదో మాట్లాడుతూ ఉండగా ప్రక్క గదిలోనుండి క్రొత్తగొంతు వినపడింది.

ఎందుకో ఆసక్తి కలిగింది.

ఎక్కడో విన్నట్లే ఉన్నదని అనిపించింది.

ఓసారి అలా తొంగిచూద్దామని అనిపించింది. కాని సభ్యత కాదని ఆ ప్రయత్నమదీ మానేశాను.

ఆ మాట్లాడుతున్నది ఎవరైనా క్రొత్తగా మందుకోసం వచ్చినవారు కావచ్చు. కాక డాక్టరుగారి బంధువు కావచ్చును. అదీ కాకపోతే మరెవరైనా డాక్టరమ్మ కావచ్చు. అకారణంగా పరాయివాడు పనివేళావచ్చి తొంగిచూస్తే ఆమె ఏమైనా అపార్థం చేసుకోవచ్చును. ఆమె కాకపోతే డాక్టరు గారు ఏమైనా అనుకోవచ్చును... ...

ఇల్లా మరికొన్ని క్షణాలు అనుమానాల్లో పడ్డాను. ఎదుట డాక్టరుగారు మాట్లాడుతూనే ఉన్నారు. ఇవతల నే నేమేమో ఆలోచిస్తూనే ఉన్నాను. మొదట్లో ఆయన ధోరణి పసికట్ట లేదు కాని నేను కొంచెం పరధ్యానంగా ఉన్నట్లు అనుమానం కలిగి కాబోలు 'ఏమిటి' అన్నట్లు నావంక చూచారు? అబ్బే ఏమీలేదంటూ తల ఆడించి కళ్ళతోనే సమాధానం చెప్పుకొన్నాను. అల్లా ఆయన్ను సమాధాన పరుస్తుండగా మళ్ళీ ఇందాక విన్న గొంతు వినిపించింది. ఈసారి వినపడగానే ఏదో చప్పున స్ఫురణకు వచ్చినట్లే వచ్చి అంతలో మనస్సులోనుండి ఆస్మృతి జారిపోయింది. నేను కొంచెం తికమకపడ్డాను.

"ఇంత మతిమరుపు వచ్చిందేమిటి"? అనుకొని విసుక్కొన్నాను.

ఈసారి ఆయన నా సంగతి పట్టేశారు. తన మాటలు వినక నే నేదో ఆలోచనలో పడిపోయానని తెలుసుకొన్నారాయన.

"ఏమిటీ ఆలోచన-అ- ఏమిటో చెప్పరాదూ?" అన్నారాయన.

అసలువిషయం చెప్పేస్తే తీరిపొయ్యేది. చెప్పానుకాను. పోనీ చెప్పేద్దామని అనిపించి, కాస్త తటపటాయించిన రెండు క్షణాల తర్వాత "నిజమే చెప్పకపోవడమే మంచిదైంది."అని అనిపించింది. అవును. ఆయన అసలే అనుమానపు మనిషి. నాకంటె వయస్సుచేతా, విద్యవలనా, చాలకాలం పదిమందిలో తిరగడంవలనా గడించిన అనుభవంచేతా పెద్దవాడు. ఇట్టే అపార్థం చేసుకొని కేకలేసే స్వభావం కూడా ఉన్నది. అనవసరంగా చీవాట్లు తినవలసి వస్తుందేమోనని భయం వేసింది. అందుకే ఆ విషయం వెంటనే కాకపోయినా తర్వాతనైనా ఆయనతో చెప్పలేకపొయ్యాను.

నిజానికి నాకాగొంతు పరిచితమైందే. బహు స్పష్టంగా విన్నదే. కాని ఆ స్త్రీని సరిగ్గా ఎక్కడ ఎప్పుడు ఎందుకు కలుసుకొన్నానో అన్నదే స్ఫురణకు వచ్చిచావడంలేదు. "నాకు బాగా పరిచయమున్నగొంతే సుమండీ" అని ఆయనతో చెప్పేసి! తీరా ఆయన "అబ్బే! అదా ఒట్టి....మనిషి. మందు కోసం వచ్చింది. దాంతో నీకెల్లా పరిచయం? నువ్వేమో బుద్ధిమంతుడవనుకొంటున్నా నువ్విలాంటి పరిచయాలు కూడా చేసుకొంటున్నావా? ఆఁ." అని అనేస్తే ఇక అప్పుడేమని సమాధానం చెప్పుకోవాలి? అకారణంగా అత్యంతక్లిష్ట పరిస్థితి కొనితెచ్చుకోవడమేకాని మరోటికాదు. ఇల్లాఅనుకొని అసలువిషయం బయటకేమాత్రమూ పొక్కనీయకుండా "అబ్బే ఏమీలేదండీ! ఈపూట అర్జెంటుగా ఊరు వెళ్ళవలసి ఉన్నది. ఆ విషయం జ్ఞాపకం వచ్చింది. వెళ్ళడమా మానడమా అని - ఎటూ తేలక కొంచెం ఇదవుతున్నాను." అనేశాను.

"అదా సంగతి. ఎందుకువెళ్ళాలో చెప్పు. నీ పిచ్చిసమస్య నేను వెంటనే పరిష్కరించేస్తాను. అయినా చూశావూ! ఒకవిషయం ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకో. కొన్నివిషయాలను గురించి మాత్రమే తీవ్రంగా ఆలోచించాలి. ప్రతి చిన్న విషయాన్నీ సమస్యగా తయారుచేసుకోకూడదు. కొంత మంది స్నానం చెయ్యడమా మానడమా అని గంటల తరబడి బహుతీవ్రంగా, ఆలోచిస్తుంటారు. అది ఒక విధమైన మానసికదౌర్బల్యం క్రిందికి వస్తుంది అల్లాంటి స్వల్ప విషయాలు అభ్యాసవశాన యంత్రవతుగా జరిగి పోవాలి. ఆలోచనా శక్తిని మరింతప్రధానమైన అంశాలకు

మాత్రమే వినియోగించాలి." అని చెబుతూ ఎందుకో ఒక్క క్షణం ఆగారు. ఏదో స్ఫురణకు వచ్చినట్లున్నది.

"వెనకటికి ఒకమ్మాయి వానలో ఇంటికి వచ్చింది. బట్టలు తడిసిపొయ్యాయి. పొడిబట్టలు వేసుకొందామా వద్దా అని ఆలోచనలో పడ్డది. ఇందాకనే కదా ఇస్త్రీ బట్టలు వేసుకొన్నది కాస్తంత తడిస్తేమట్టుకూ అప్పుడే విప్పేయడమా, కాని విప్పకపోతే జలుబుచేస్తుందేమో!" అని తర్కించుకొన్నది. ఆలోచనలో పడ్డది. ఆ సాయంత్రందాకా ఆమెకా ఆలోచన తెగలేదు. బట్టలు వంటిమీదనే ఆరిపొయ్యాయి. అరెరె! పొడిబట్టలు వేసుకోకపోతినే అని తపనపడ్డది. ఆ రాత్రే జ్వరమూ వచ్చింది. మర్నాడు ఇక్కడకు మందుకూ వచ్చింది. ఇంతకూ ఎందుకు చెప్పానంటే-అవును; స్వల్ప విషయాలను గురించి అంత చేటుబాధ పడకూడదు. సరే గాని ముందా పనేమిటో చెప్పు" అన్నారు డాక్టరుగారు.

చెప్పక తప్పింది కాదు. అందులోనూ అప్పటికప్పుడూ కల్పించి "మిత్రుణ్ణి కలుసుకోడానికండీ!" అన్నానుచివరకు.

"అతను నీకు ముఖ్యుడా? ఆ మాట్లాడవలసిన విషయం ముఖ్యమయిందా?"

"అతనంత ముఖ్యుడూ కాదు....... విషయమూ అంతే ననుకోండి ..."

"అయితే ఇంకేం మరి మానేసెయ్." అని చప్పున తేల్చేశారాయన.

"కాని అల్లా వీల్లేదండీ అతను చాలా నొచ్చుకొంటాడు. బాల్య స్నేహితుడు" అని మొదలుపెట్టి ఇక అబద్ధాల గొలుసు కట్టు అల్లుకొని పోతున్నాను. ఎందుకు వెళ్ళాలో, వెళ్ళకపోతే ఏమి ఇబ్బందో, కాని వెళ్లడానికి ఉన్న అవరోధా లేమిటో చెప్పుకొనిపోతున్నాను.

అంతలో మళ్ళీ అదే గొంతు విన్పించింది. ఆ వ్యక్తి గుమ్మానికి అవతలగా, పరదా వెనుకనుండి మాట్లాడుతున్నది ఎవరితోనో. రెండు క్షణాల తర్వాత "డాక్టరుగారూ! మీరు ఓసారి ఇలా రాగలరా?" అని అడిగిందా వ్యక్తి. ఆ మాటలు స్పష్టంగా వినిపించాయి.

నాజూకుగా మాట్లాడడము క్రొత్తగా నేర్చుకొన్నట్లుగా తెలుస్తూనే ఉన్నది. కొద్దికాలం క్రిందటివరకూ ఆమెకు సహజంగా ఉంటూవచ్చిన యాస జాగ్రత్తగా వింటే ఇప్పటికీ కన్పిస్తూనే వున్నది. అంతలో మళ్ళా ఇందాకటిలా మనస్సులో మెరపులా ఏదో స్మృతి మెరిసింది. మనోవీథి అంతటా ఒక్కసారి విద్యుద్దీపాలు వెలిగి ఆరిపోయినట్లయ్యింది. వెంటనే దృష్టి అంతా అటు మరల్చి దాన్ని దృఢంగా పట్టేసుకొన్నాను. అప్రయత్నంగా "యస్, యు ఆర్ రైట్" అనేశాను. వెధవది అభ్యాసంలో అంత దృఢంగా నాటుకొని పోతోంది ఆంగ్లభాష. చదువుకోవడం, మాట్లాడుకోవడం కాకుండా భావించడం, ఇంకా మాట్లాడితే కలవరించడం కూడా పరభాషలోనే. ఇంత అన్యాయమా! ఈ విషయమై డాక్టరుగారు ఒక అరగంట మాట్లాడేయగలరు. కాని నా అదృష్టవశాత్తు ఆయన ఈ విషయం పట్టించుకోలేదు. కాని "ఏమిటి? ఏ విషయం?" అని మాత్రమే అడిగారు.

"అదేనండీ! మీరు ఇందాక చెప్పారే, స్వల్పవిషయాలను గురించి అనవసరంగా ఆలోచించకూడదని ఆ విషయం."

"సరే అయితే గురికుదిరిందన్నమాట." అని ఒక్కక్షణం ఆగి "ఇప్పుడే వస్తానుండు" అంటూ ఆయన లేచి స్టెతస్కోపు మెడలో తగిలించుకొని ప్రక్క గదివేపు వెళుతూ, "కనుక నీవువెంటనే ఒక నిర్ణయానికి వచ్చేయగలవన్న మాటేగా?" అన్నారు. అని పరదా తొలగించుకొని లోపలకు వెళ్ళారు.

కాని నేను అబద్ధమాడాను. నేను ఆ మాటల అనుకొన్నదీ - అన్నదీ వారు చెప్పిన విషయమైకాదు. ఆ గొంతు నేను ఎక్కడ విన్నదీ స్పష్టంగా గుర్తుకువచ్చి అన్న మాటలవి. "అవును. ఆ గొంతు ఆరోజు నేను. అవునా ఊళ్లో విన్నాను, అర్ధరాత్రి...." అనుకొన్నాను. గుమ్మం అవతల డాక్టరుగారితో ఆమె ఏదో నెమ్మదిగా చెబుతున్నది. "ఆహా అల్లాగా అయితేసరే - సామాన్లన్నీ సిద్ధం చేశావన్నమాట - మంచిది మంచిది" అంటున్నారు డాక్టరుగారు. ఆమె రోగి కేదో చెబుతున్నది.

ఆమె విషయం ఇప్పుడు నిర్ధారణ అయ్యింది. కాని జ్ఞాపకం రావడానికి ఇంతసేపు పట్టవలసిందికాదు. నాలుగయిదు ఏళ్ళు గడచిపోవడం మూలంగానూ, నాకు కొంత మతిమరుపు ఉండడము కారణంగానూ ఇంత ఆలస్యమైంది. ఏదో స్టేషన్లో ప్లాటుఫారంమీద నిల్చుని రైలుబండిలోనుండి ఎవరో ఎవరితోనో మాట్లాడుతుండగా విని ఆ తర్వాత ఆ గొంతు పోల్చుకోలేకపొయ్యానూ అంటే అర్థముంది కాని ఆ ప్లాటుఫారంమీద తాపీగా అంతసేపు సంభాషణ.. ఒట్టి సంభాషణేనా!!

ఆరోజు రాత్రి.

వేటపాలెంలో బండి తప్పింది. ఒక్క పదినిముషాల్లో తప్పిపోయింది. అకారణంగా నేనే ఆలస్యం చేశాను. ప్రియమిత్రుణ్ణి చూచివద్దామని అతనితో అత్యవసర విషయాలేవో మాట్లాడివద్దామని బయలుదేరివెళ్ళి రాత్రి పదిగంటలకు స్టేషన్లో బండిదిగి ఇంటికి వెళ్ళాను. కాని తలుపు తాళం వేసిఉన్నది. ఆపళంగా వెంటనే స్టేషనుకు వచ్చేస్తే బండి

లక్షణంగా అందేది. సినిమాకు వెళ్ళాడేమోనని హోటలుకు వెళ్ళి అక్కడ లేకపోతే మళ్ళీ ఇంటికివచ్చాను. "తాళంపెట్టి వెళ్ళాడే ఎక్కడకు వెళ్ళాడు చెప్మా" అని ప్రశ్నించుకుంటూ "పోనీ అతను వచ్చేదాకా ఈ వరండాలోనే పడుకొందామా ఏమిటి?" అని ఆలోచనలో పడి బెడ్డింగువిప్పి ఈ కాసేపటికి బెడ్డింగు విప్పడంకూడా దేనికని దాన్ని యధాప్రకారం చుట్టి. ఏమో అతను గ్రామాంతరం వెళ్ళాడోఏమో పోనీ వచ్చిన దారినే వెళ్ళిపోదామా ఏమిటి? అనుకొని ఎటూతేలక సతమతమవుతూ అర్ధగంటసేపు వృధా కాలయాపన చేసిన తర్వాత దారినపొయ్యే పెద్దమనిషి "ఆయనకు బదిలీఅయి వెళ్ళిపోయారండీ" అని చెబితే అప్పుడు బయలుదేరి స్టేషనుకు వచ్చాను.

అవు నాపూటకలిగిన అనుభవం ఎట్లాచూచినా మరచిపో తగిందికాదు.

స్టేషనుకు వస్తుండగా దారిలోనే చినుకులు పడడం ఆరంభమైంది. వాన పెద్దదై తడిసిపోతానేమోనని రిక్షావాణ్ణి ఆపి టాపువేయించి తెర ఒకటి కట్టించుకొన్నాను. వాన పెద్దది కాకముందే స్టేషనుకు చేరుకొన్నాను. కాని ఏంలాభం బండికాస్తా తప్పిపోయింది. సరిగ్గా బండి స్టేషను వదలి వెళ్ళిన పది నిముషాలకు నేను అక్కడకు చేరుకొన్నాను. కనీసం దారిలో ఆలస్యం చేయకుండా వచ్చినా బండి అంది ఉండేది సుమా అని ఎంతో నొచ్చుకొన్నాను.

నా తెలివి తక్కువతనానికీ, అనవసరపు నా అనుమానాలకూ నా మందకొడితనానికీ నన్ను నేనే నిందించుకొన్నాను.

లోపలకు వెళ్ళి వాకబుచేసి వచ్చాను. కచేరీ గది తాళం వేసి పోతున్న మాస్టరుగారు మళ్ళా మూడు గంటలదాకా బండి లేదన్నారు. "ఏంచెయ్యాలి అప్పటిదాకా. అందులోనూ ఇల్లాంటి చిన్న స్టేషన్లో. పైగా అర్థరాత్రప్పుడు. అందులోనూ వర్షంలో. పోనీ వెనక్కు వెళ్ళతేనో. వెళితే మాత్రం ప్రయోజనం? అక్కడయినా ఒంటరిగా వరండాలో పడుకోవద్దూ? జల్లు లోపలకురాదని నమ్మకం యేమిటీ? అదీకాక మళ్ళా మూడు గంటలకు మెలుకవ వస్తుందా? ఒకవేళ వస్తేమట్టుకూ ఆ వేళప్పుడు నే నీ బెడ్డింగు పుచ్చుకొని స్టేషను చేరుకోవడ మెల్లా? నాకు తోడు ఓ బెడ్డింగు కూడానూ; ఓ పూటలో తిరిగివచ్చే భాగ్యానికి ఇంత బెడ్డింగు ఎందుకు తేవాలీ? కాదయ్యా ఇప్పుడు వెళ్ళాలనే అనుకొందాము - వెనక్కి వెళ్ళేందుకు రిక్షాలేవీ? ఏం చెయ్యడమిప్పుడు?" అన్నీ సమస్యలే. వెధవ ప్రశ్నలు - వెధవ ప్రశ్నలు, నన్నూరికే ఊదరపెట్టి ఎటూ తోచకుండా చేశాయి.

చివరకు ఏ నిర్ణయానికీ రాకుండానే ఖాళీగా ఉన్న బల్ల మీద ఒక మూలగా పరుపుచుట్ట పెట్టుకొని దానిపైన నడుమానించి కాళ్ళు జాపుకొని విశ్రాంతిగా పడుకొన్నాను. పైనున్న ఉత్తరీయం ఒళ్ళంతా కప్పుకొని 'పోనీ కాసేపు నిద్రపోతే వచ్చిన ప్రమాద మేమీ లేదుకదా' అని ప్రశ్నించుకొన్నాను. "పోనీ అంత అర్జంటుగా వెళ్లేవాడు నాకు కాస్త ఓ టెలిగ్రామ్ ఇస్తే ఏంపోయిందీ? ఆ మాత్రం తెలియక్కర్లేదా?" అనుకొంటూ మిత్రుడిమీద విసుక్కొన్నాను. అల్లా విసుక్కొంటూ నిద్రపోదామని ప్రయత్నం చేస్తూ బయటకు ప్రకృతివైపు చూచాను.

ఇంకా సన్నగా వర్షం పడుతూనే ఉన్నది. చక్కని వెన్నెల కాస్తున్నది. వెన్నెల కురుస్తున్నట్టున్నదా అనిపిస్తున్నది. చంద్రుడు వానలో కరిగిపోతున్నాడా అనిపించింది.

ప్రకృతి ఎంతో మనోహరంగా నిశ్చలంగా ఉన్నది. మధ్యమధ్య గాలి వీచినప్పుడు చెట్లు బద్ధకింగా కదులుతున్నాయి. ప్రౌఢాంగన మైపిరుపుల్లా ఉన్నా యా కదలికలు. దూరంగా ఉన్న ఇసుకదిబ్బలు మంచుగుట్టల్లా కన్పిస్తున్నాయి.

నన్ను ఇందాక కొంతసేపు చీకాకు పరచిన పెట్టిమొట్టి ప్రశ్నలన్నీ ఎక్కడివక్కడ మాయమయ్యాయి.

ఇంక ఏం చేద్దామన్న ప్రశ్నేలేదు.

"ఈ ప్రకృతిని పరిశీలిస్తూ ఆనందంగా కాలం గడపవచ్చును. ఎంతసేపైనా సరే" అని అనిపించింది. నేను నెమ్మదిగా లేచివెళ్ళి కటకటాల దగ్గర నిల్చున్నాను బయటకు చూస్తూ. అల్లా చాలా సేపు నిలబడిపొయ్యాను.

అంతలో వర్షం బాగా పెద్దదయింది. గాలి అకస్మాత్తుగా విజృంభించింది.

మొక్కలూ, చిన్నచిన్న చెట్లూ తలలు తెగ ఆడిస్తున్నాయి. పంతులు లేని ప్రాథమిక పాఠశాల్లో తరగతి పిల్లల్లాగా గంతులు వేస్తున్నట్టున్నా యవి. కాస్త దూరంగా విశ్రాంతిగాఉన్న మర్రిచెట్టు తలపాగా చుట్టుకొని కాస్త హుందాగా నిలబడ్డ ప్రధానోపాధ్యాయుడులా కన్పిస్తున్నది.

ఈ దృశ్యంకూడా నా హృదయాన్ని ఆకర్షించింది. మరి కొంత సేపటికి వాన పెద్దదయింది. గాలి మరీ వెఱ్ఱిగా వీయడం మొదలుపెట్టింది. స్టేషనుకు వంగగజాల దూరంలో ఉన్న తాటాకు పాకలనుండి ఆకులు లేచివచ్చి ప్లాటుఫారం మీదపడి గాలి మరల మరల వీచినప్పుడల్లా ఎగిరెగిరి పడుతున్నాయి. నేను నిల్చున్న రేకులషెడ్డు నిర్జనంగా ఉన్నది. షెడ్డులోనే ఉన్న బజ్జీదుకాణంవాడు కొట్టుకు తాళం పెట్టి ఎప్పుడు వెళ్ళిపోయాడో నే నసలు గమనించనే లేదు. వాన చినుకులు పైన రేకులమీద పడుతూ పెద్దశబ్దం చేస్తున్నాయి,

నేను ఆ శబ్దం వింటూ, బయటకు చూస్తూ చాలాసేపు నిలబడి, వచ్చి బల్లమీద యథాప్రకారం పడుకొన్నాను. కాస్త సిగరెట్లు అలవాటున్నా బాగుండేది సుమా అనుకొన్నాను. కాని అంతలో అట్టి దురభ్యాసం మూలంగా కలుగగల దుష్ఫలితాలూ, ఇబ్బందులూ ఒక్కసారి జ్ఞాపకం వచ్చి చివరకు "అల్లాంటి అభ్యాసాలు ఎవరో దొరలకూ, నవాబులకూ సరిపోతాయి కాని నాలాంటి వాళ్ళకోసం కాదు" అనుకొని సర్దిచెప్పుకొని ఇక నిద్రపోతే ఏ ప్రశ్నరాదు అని నిద్రకు ఉపక్రమించాను.

కాని నిద్ర రాలేదు.

దూరంలో మఱ్ఱిచెట్టు క్రిందనుండి ఎవరో మనిషి వస్తున్నట్లుగా కన్పించింది. ఒక చిన్న పెట్టె ఒకటి చంకన పెట్టుకొని తీరా షెడ్డుదగ్గరకు వచ్చేదాకా ఆ వచ్చిన మనిషి స్త్రీ అని పోల్చుకోలేకపొయ్యాను. ఒళ్ళంతా మాసిన దుప్పటి ఒకటి కప్పుకొని వచ్చింది.

ఎవరో ముసిల్దిలే ఇక వెధవ ప్రశ్నలన్నీ వేసి, పొగాకు పెట్టమనీ అనవసరంగా చికాకు కలిగిస్తుందని ఉత్తరీయం ముఖం మీదకు లాక్కొని నిద్ర నటించాను.

ఆ వ్యక్తి లోనికి వచ్చింది.

మెట్టెలు చప్పుడవుతున్నాయి.

నెమ్మదిగా బజ్జీకొట్టు ప్రక్కకు వెళ్ళింది. వద్దువద్దు అనుకొంటూనే గాజుల చప్పుడుబట్టి ఆమె ఉనికినీ, ఆమె గమనాన్నీ గమనిస్తూనే ఉన్నాను. పెట్టె నేలమీద ఈడ్చిన చప్పుడయ్యింది. నేను ఎడమచెయ్యి బెంచీమీద ఒత్తిపట్టి మెడ ఎత్తి అటువైపు చూచేసరికి ఆమె పెట్టెతెరచి చీర తీసుకొంటున్నది.

గుడ్డి వెల్తురులో ఆమె కన్పించింది.

మహా చెడ్డ ఆసక్తి కలిగించింది.

అదే కాస్త వయస్సుమళ్ళిన మనిషైతే ఏమాత్రమూ ఆసక్తి కలుగకపోను. నేను అదే స్థితిలో ఉండి నిశ్శబ్దంగా ఆమె ఏమిచేస్తున్నదా అని పరిశీలించాను.

దుప్పటి కప్పుకొని వచ్చినా బట్టలు బాగా తడిసిపోయి నట్లున్నాయి. పెట్టెలోనుండి పొడిబట్టలు తీసుకొన్నది.

బట్టలు తడిసిపోవడంవలన దేహ సౌష్ఠవం దూరంనుండి కూడా స్పష్టమవుతున్నది.

వస్త్రధారణ.

ఎందుకోకాని మనసు విచలితమైంది. ఆమె నా వ్యవహారం కాస్తా కనిపెడుతుందేమోనని భయం, ఏదో పెద్ద అమూల్యమైన అవకాశం చెయ్యిజారిపోతుందేమోనని ఆపుకోలేని ఆందోళన - ఆరాటం, ఎందుకో చెప్పలేను.

నెమ్మదిగా అటువైపే తిరిగి పడుకొని ఒకవేళ ఆమె నా వంక చూచినా నేను నిద్రపోతున్నట్లు భ్రమపడేలాగున కుడిచెయ్యి నుదుటిమీద వేసుకొని నటన మొదలుపెట్టాను.

నిజమే నేను సరిగ్గానే ఊహించాను. ఆమె అక్కడే నావంకే చూస్తూ నిలుచున్నది. అడుగులో అడుగు వేసుకొంటూ నా వైపుగా కొంత దూరం వచ్చి నాకు నాలుగయిదు అడుగుల దూరంలో నిలిచి నన్ను పరిశీలించింది. ఆమెకు ఈ విషయంలో అనుమాన నివృత్తికి దృఢవిశ్వాసం కలిగేందుకు అదనంగా ఏమి చేద్దామా అన్న ఆలోచనలో ఒక్క క్షణం సతమతమయ్యాను. గురక పెడదామా అని ఒక ఆలోచన వచ్చింది కాని అంతకంటె తెలివితక్కువ పని మరొకటి ఉండబోదని వెంటనే స్ఫురణకు వచ్చింది. ఈ సందర్భాన్నే పురస్కరించుకొని చెప్పబడే కథ ఒకటి ఎప్పుడో చిన్నప్పుడు విన్నది జ్ఞాపకం వచ్చి నాలో నేను నవ్వుకొన్నాను.

ఇంకా నయం పెద్దగా నవ్వానుకాను.

ఆమె మరో క్షణం అల్లాగే నిలబడి నమ్మకం కలిగింది కాబోలు నెమ్మదిగా వెనక్కు వెళ్ళి పొడిచీర అందుకొన్నది.

ఒక్క నిముషం ఊపిరి బిగపట్టుకొన్నాను.

ఆసక్తి మహాప్రవాహం ఒక్కసారి ఆగిపోయింది. ఒక్కసారి మెరుపులా మెరిసింది సౌందర్యం నగ్నసౌందర్యం! నవయౌవన వయోవిలాసం, పైగా అక్కడ ఇంకెవ్వరూ లేకపోవడం.

ఒడలు పులకరించింది.

మనసు కలవరించేసింది.

ఆమె చీర మార్చుకోవడం పూర్తికావస్తున్నది. ఒకసారి అలా గుండ్రంగా తిరిగి పమిట విసురుగా వేసుకొన్నది. సౌందర్య రేఖావలయాలు నామీదకు దాడివస్తున్నాయా అనిపించింది. అవి నన్ను చుట్టేసుకొంటున్నాయా అనిపించింది. ఆమె నావైపే తిరిగి రవిక ముడివేసుకొన్నది. ఎంత పొంకంగా ఉన్నది!

పూచిన పొన్నచెట్టులాగున అందంగా పొంకంగా ఉన్నది. నిలువునా చివురించిన గున్నమామిడిలాగున మనిషి నిండుగా ఉన్నది. చెట్టూ పుట్టాలేని మైదానంలో ఒడ్డులు ఒరసికొంటూ సాగిపోతున్నా ఆగిపోయినట్లే కన్పించే నదిలాగున గుంభనగా ఉన్నది.

ఆమె దేహయష్టికి నేను ఆశ్చర్యపడ్డాను. అనుకోకుండా అయాచితంగా స్వీయ సౌందర్యప్రదర్శన మూలకంగా నాకింత ఆనందాన్ని కలిగించింది. నూతనానుభూతిని

అందించింది. అప్రయత్నంగా నా మనస్సు ఇంతసేపు పరవళ్ళు త్రొక్కించింది. ఎవరీమె ?

ఎవరూఅంట ఈ పల్లెపడుచు ?

ఎందుకిల్లా వానలో వచ్చింది ? ఇదేం తన ఇల్లు అను కొన్నదా బట్టలు మార్చుకోవడానికి ? పైగా తడిచీరా రెవికా ఇక్కడే ఆరవేసుకొంటున్న దే ! అరె ఏమిటిదంతా ? ఈమె కింత స్వతంత్రం ఎక్కడిదీ ?

వర్షంలో ఇల్లు వదలిపెట్టి స్టేషనుపెద్దుకు రావడమేమిటి ? వానలో అలా తడవడమెందుకూ మళ్ళా అవి మార్చుకోవడ మెందుకూ ? అసలీమె నేను నిద్రపోతున్నాననే అను కొన్నదా కాక నా సంగతి పసిగట్టికూడా నన్ను లెక్క చెయ్యలేదా ?

ఎన్నో ప్రశ్నలు. ప్రశ్న పరంపరలు. ఆ ప్రశ్నలకు సమాధానాలు రాకముందే మరో ప్రశ్నపరంపర.

ఈ పిల్లకు పెళ్ళి అయిందా ? వయస్సు ఏమాత్రం ఉంటుం దేమిటి ? భర్త ఎవరో ? భర్తఅంటూ ఉంటే ఈమెను ఇల్లా ఒంటరిగా పైగా వానలో బయటకు ఎందుకు పోనిచ్చి ఉంటాడూ ? చెప్పకుండా వచ్చేస్తున్నదా ?

గుట్టలమీదనుండి క్రిందికి దొర్లివస్తున్న వాగులా ఒకటే ప్రశ్నల రొద. ఇంతలో ఒక మంచి తెలివైనప్రశ్న వచ్చింది. "అసలూ ఈ వివరాలన్నీ నీకెందుకూ ?" అని. నిజమే నాకెందుకూ ?

"ఆమె కన్యా కావచ్చును. కాదూ కాపరంచేస్తున్న మనిషీ కావచ్చును. ఏదో అర్జంటుపనిమీద స్టేషనుకు వచ్చి ఉండ వచ్చును. అయినా నీకెందుకీ అనవసరపు ఆసక్తి ఇంకెవ రైనా వింటే నవ్వుపోతారు. ఏదో దక్కినంతవరకు ఏమీ కష్టం లేకుండా, దమ్మిడీ వ్యయం కాకుండా, పైగా అయాచి తంగా పరకాంతాదేహ సౌందర్యదర్శనం లభించింది. తప్పో ఒప్పో ఏదో అయిపోయింది. నీలోపం వల్లగానీ, ఏదో సందర్భవశానగానీ అనుకోకుండా వ్యవహారం ఇంతదూరం సాగింది. ఇక కట్టిపెట్టు. సమాధానాలకోసం ప్రయత్నం చేసి, సంభాషణలోకి దిగి అనవసరపు చిక్కుల్లో పడకు." అని ఎవరో గదమాయించి చెబుతున్నట్లే అనిపించింది. కాని మనస్సు ఊరుకొంటేనా !

మరచిపోక పోవడమే కాకుండా - పైపెచ్చు ఇందాక నేను దర్శించిన దృశ్యాన్నే మరల మరల జ్ఞాపకంచేసి ఆనందపు పొంగు చల్లారనీయకుండా నిలిపి ఉంచుతోంది నా మనస్సు. ఆమెకు నా గొడవేమీ పట్టలేదు. ముడిముడి వేసుకొన్న కొప్పు విడదీసి అరచేతి అంచులతో జుట్టును కొడుతూ వేళ్ళతో చిక్కు తీసుకొంటూ నెమ్మదిగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నది.

ఎంత పెద్దజుట్టు ! జుట్టుపై చేత్తో అల్లా అన్నప్పుడల్లా గాలి వీచినప్పుడల్లా పరుగులు పెట్టే నీలమేఘ శకటాల్లాగా జుట్టు పాయలు పాయలుగా విడిపోయి చప్పున వీపుమీద పడుతున్నది.

ఆమె నెమ్మదిగా జుట్టు ముడివేసుకొని కుచ్చెళ్ళు, పమిటా సవరించుకొని తాపీగా వెళ్ళి ఇనుప కటకటాల దగ్గర నిలబడి అవతల చంద్రుణ్ణి చూస్తూ చాలాసేపు అలా వుండి వెళ్లిపోయింది.

ఆమె నిల్చున్నచోట కొంతమేర వెన్నెల పడుతున్నది. ఆమె వెళ్లి వెన్నెల్లో నిలబడితే బాగుండు ననిపించింది.

అల్లా చాలాసేపు నిల్చున్నది.

ఏదో ఆలోచిస్తున్నట్లు అనిపించింది.

ఏమిటి ఆలోచిస్తున్నదా అని నేను ఆలోచించడం మొదలుపెట్టాను.

* * *

"ఏమిటోయ్ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?" అంటూ డాక్టరుగారు నెమ్మదిగా నా భుజంమీద తడుతూ ప్రశ్నించారు.

నేను ఒకసారి ఉలికిపడ్డాను. కొంచెం గాభరాపడ్డాను "అప్పటి విషయమంతా జ్ఞాపకం చేసుకొంటున్నానండీ" అని చెప్పనా ? ఇంకేమన్నా ఉన్నదీ ? అర్ధరాత్రివేళ పరాయి ఆడదాంతో ఒంటరిగా... అని అడిగేనుగా ! పైగా అప్పటి నా పరిస్థితి, ఆ ఏకాంతమూ, నేను దర్శించిన దృశ్యమూ అవన్నీ వరుసగా చెప్పవలసిందేగా ! కేవలం అక్కడిదాకా అంతేనండీ జరిగిందని చెప్పి ఆపివేయడం ఎల్లా ? ఒకవేళ నేను "ఇంతేనండీ" అని చెప్పినా ఆయన నమ్ముతారా ? మరింత అపార్థం చేసుకోరూ ?

"వీల్లేదు. ఆ విషయాలేవీ ఎత్తడానికి ఎంతమాత్రమూ వీల్లేదు" అనుకొని వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాను. ఎల్లాగో అబద్ధాలాడడమంటూ మొదలుపెట్టాను గనుక మరో అబద్ధం కూడా ఆడేస్తే వచ్చిన ప్రమాదమేమీ లేదనే అను కొన్నాను. అల్లా అనుకొని "అబ్బే, ఏమీలేదండీ. మానవ జీవితంలోని మార్పుల్ని గురించి ఆలోచిస్తున్నానండీ" అని అన్నాను.

"అంటే ? ఎవరెవరి జీవితగాథల్ని ఆధారంగా చేసుకొని ఆలోచిస్తున్నావూ ?" అని అడిగా రాయన.

"అబ్బే, ఎక్కడిదాకానోఎందుకూ నా జీవితాన్నే తీసుకొని జరిగిపోయిన కాలం, వచ్చిన పరిణామాలూ, కలిగిన అనుభవాలూ - వీటిని ఒక క్రమంలో జ్ఞాపకం చేసుకొని

"నువ్వు భోజనం చేశావా?" అని ఊరికే యథాలాపంగా అడిగాను. ఏదోలా తెగిన సంభాషణను పునః కొనసాగిద్దామన్న ఉద్దేశ్యంతో.

"నేను ఈ పూట ఏంటి - మధ్యాహ్నం కూడా తినలా - అయితే ఏం పర్వాలేదులెండి. నా కలవాటే." అన్నది.

ఆ చెప్పడం ఎంతో అమాయకంగా చెప్పింది. నాకు నిజంగా జాలివేసింది.

తను మధ్యాహ్నం భోజనం చేయకుండా ఉండికూడా రాత్రికి ఈ అరటిపండ్లు తిని నిద్రపోదామనుకొన్న మనిషి పరాయివాడి ఆకలి విషయం కనుక్కొని అడిగి కాస్తా దానం చేస్తుందా? ఏమిటీ ఔదార్యం?

ఇంతవరదాకా ఆ వ్యక్తి బాహ్యరూపాన్ని చూచి ఇల్లా ప్రవర్తించగలదని నేనూహించుకోలేదు. న్యాయానికి కడుపు నిండిన తర్వాతనే ఇతర విషయాలు. ఇలాంటి త్యాగాలూ ఇవీ ఎవరో మహోదాత్తులు చేయవలసినవే కాని సామాన్యులు చేసేవి కాదు. ఎందుకు చేసిందిల్లా?

ఏమిటీ భరోసా!

ఏమి ఉద్దేశించి చేసింది?

"నాలానే తనకూ దురుద్దేశమే ఉంటే ఇందాక అల్లా దూరంగా ఎందుకు వెళ్ళిపోయిందీ?" నా కాలోచన తెగలేదు.

ముందామె సంగతి కొంతయినా తెలుసుకొందామని ఆసక్తి కలిగింది.

అల్లాగయినా ఆమెను తిరిగి సంభాషణలోకి దింపవచ్చును అని కూడా అనిపించింది. పైగా ఈ ఆలస్యంవలన పుట్టి మునిగిపొయ్యేదేమీ లేదనీ, అదీకాక త్వరపడడ మనేది ఒట్టి మొరటుతనమనీ అర్థమయ్యింది. "వాతావరణంలో పెద్ద అననుకూల్యమూ లేదు; హఠాత్తుగా మార్పురాగల సూచనలూ లేవు. మరో విషయం - ఆమె ఏం మహాపతివ్రత కాదు. ఇటు నేనేం బ్రహ్మచారిని కాదు. అంచక్కా ఏడేళ్ళసంసార జీవితానుభవం కలవాణ్ణి." ఇల్లా భావనచేసి ఆమెను నెమ్మదిగా దగ్గరకు రమ్మని పిల్చాను. దగ్గరకు వచ్చాక "ఏం ఎందుకు తినలా ఇంట్లో ఎవరిమీదైనా అలిగావా?" అని అడిగాను.

"ఏంటీ"

నేను మళ్ళీ అడిగాను సానుభూతి కన్పరుస్తూ. నాకు నిజంగా సానుభూతి కలిగిందనుకొన్నదో, కాక ఏ స్వభావాన ఉన్నదో ఏమో, వచ్చి నా కాళ్ళ దగ్గరగా క్రింద కూర్చుని "ఇంటిదగ్గర మరెవ్వరున్నారూ?" అన్నది.

"అంటే?"

"అంటే ఏంటి? విచిత్రంగా అడుగుతారేం!"

"విచిత్రంగా అడగట మేమున్నదీ? తల్లీ తండ్రీ - భర్తా... ఎవరిమీద అలిగివచ్చావో అని అడిగాను."

"ఎవర్లేందే - ఎవరిమీద అలుగుతాను?"

"అరే - లేకపోవడమేమిటి?"

"అంత వివరంగా అడుగుతున్నారే - మీరేం పోలీసు పనేమైనా చేస్తున్నారా ఏమిటి?" అబ్బే కాదు - అయినా చెప్పకూడనిదైతే చెప్పొద్దులే" అన్నాను.

"పెద్ద దాపరికాలేమున్నాయి? అంత మీకు వినాలని ఉంటే చెప్తాను" అని తన విషయం చెప్పడం మొదలుపెట్టింది.

పెండ్లయిన రెండేళ్ళదాకా తన మొగుడు చేస్తున్న ఉద్యోగ మేమిటో తనకుగానీ, తన తండ్రికి గానీ తెలియదట. తన కులంవాళ్ళంతా ముతకపంచలు ఎగగట్టి కూలీ నాలీకి పోయి వస్తుంటే అల్లుడు పైజమాలు షరాయీ వేసి బస్తీకి పోయివస్తుంటే ఏమో అనుకొని మురిసిపోయాడట ఆమె తండ్రి.

కాని తీరా చూస్తే తార్పుగాడి పని.

ఆ పని మానేయమని తను చెప్పినా, తండ్రి కాళ్ళావేళ్ళా పడి బ్రతిమిలాడినా అతగాడు వినలేదట. పైగా "ఇందులో మాత్రం ఎంత ఒడుపు కావాలీ - మరొకర్ని చెయ్యమనండి చూద్దాం" - అనేవాడట. రెండుచేతులా డబ్బు సంపాదించేవాడట.

ఇంట్లో కావలసినవన్నీ కొని తెచ్చిపడేస్తూ దర్జాగా గడిపేవాడట. కొద్దికాలంలోనే ఒక చిన్న స్థలం కొని అందులో ఒంటి నిట్రాయిపాక వేయించి నువ్వు సుఖంగా బ్రతకడమే నాకు కావల్సింది. నా వృత్తికి మాత్రం నువ్వు అడ్డురాకు మనేవాడట.

ఆనాటి కానాడు అతని పోకిరీ వ్యవహారం మించిపోయిందట. మోతుబరి ఆసాముల ఇళ్ళల్లోనుండి వయస్సు పిల్లల్ని రెండోకంటికి తెలియకుండా బస్తీకి చేర్చి విటుల కప్పగించి ఇద్దరి దగ్గిరా డబ్బు గుంజేవాడట. తాను అడ్డం వచ్చినప్పుడల్లా దెబ్బలు తినేదట.

ఒక్కొక్క విషయమే నెమ్మదిగా చెప్పుకొని పోయింది. "పోనీ డబ్బు కూడుతున్నది. పాడిగేదెల్ని కొన్నాడు. సంసారం గడుస్తున్నది ఇతగాడు కొన్నాళ్ళకయినా బాగుపడక పోతాడా" అనుకొంటూ భావిజీవితాన్ని గురించి తాను ఎలా కలలు కన్నదీ చెప్పుకొనిపోయింది.

"కాని నే నేం అనుకొంటే ఏంలాభం - పెళ్ళయిన నాలుగేళ్ళకే - సానికొంపలో ఖూనీ అయిపోయాడు" అని చెప్పి భోరున ఏడ్చింది. నేను కొంత ఓదార్చాను.

ఓదారుస్తూనే "పోనీ కూడబెట్టిన డబ్బు ఉన్నదిగదా దాంతో...." అని ఆగాను. ఆమె అందుకుని "కాని అది న్యాయంగా వొచ్చిందయితేనా! అక్కడ ఖూనీ కాగానే వాళ్ళే మాయింటికి వచ్చి ఉన్నమట్టుకు దోచుకొనిపోయారు. పోతూపోతూ పాకకు అగ్గిపెట్టిపోయారు." అని మళ్ళా ఏడుపు మొదలుపెట్టింది.

"ఎప్పుడో అయిపోయిందావికి ఇప్పుడేడుస్తావెందుకు. ఊరుకో." అని నెమ్మదిగా ఓదార్చాను. ఆ తర్వాత సంగతంతా నేను మధ్యమధ్య ప్రశ్నలు వేయకుండానే చెప్పేసింది.

మొగుడు పోయిన ఏణ్ణర్థానికి తండ్రి పోయాడట. గతిలేక మునసబుగారింట్లో పనికి కుదిరి వళ్ళువంచి పనిచేసి రాత్రిళ్ళు వారి గొడ్లచావిడిలో తలదాచుకొనేదట. అక్కడ పనికి ఉంటున్న రోజుల్లోనే మునసబుగారి కొడుకుతో, స్నేహం కలిసిందట.

మొదట బలవంతంచేసి, తర్వాత కాస్త పెద్దమొత్తాలు డబ్బుఇచ్చి తన్ను లోబరచుకొన్నాడట. కాని ఆ వ్యవహారం ఇంట్లో తెలిసేసరికి ఆయనగారు బస్తీకిపోయి మళ్ళా తన వంక తిరిగి చూడలేదట.

తనకథ చెబుతూ "తప్పు మొదటిసారిగా చెయ్యడమే తప్పు - ఇక ఆ తర్వాత చేసేవన్నీ తప్పులుకావు, దాన్ని అనుసరించి వచ్చేవేకాని మరోటికావు." అంటూ ఒక సిద్ధాంత ప్రతిపాదన చేసింది. తనమొగుడు పెద్దఇంటిపిల్లల్ని చెడగొట్టినందుకు తన్ను శిక్షించాలని దేవుడే తనకీపాడుబుద్ధి పుట్టించి పూర్తిగా తను చెడిపోయేదాకా చూస్తూ ఊరుకొన్నాడని అంటూ విధివిలాసాన్ని గురించి ప్రస్తావించింది. తను కులంచేతకానీ, వృత్తిచేతకానీ సానిది కాకపోవడం వలన తనకు ఇల్లాగూ బ్రతుకు గిడవడంలేదట. చేతిలో డబ్బులు అయిపోయేదాకా ప్రతిసారీ తను నీతిగానే బ్రతుకుతూ వచ్చిందట. కాని ఒకటి రెండు పూటలు ఉపవాసాలయ్యాక ఎవర్నో ఒకర్ని ఆశ్రయించడం, పాతికో పరకో గణించుకోవడమూ మామూలయిపోయిందట.

సిగ్గు విడిచేసి ఎన్నో విషయాలు చెప్పేసింది. తాను టెక్కులు నేర్చుకొన్న విధానం, తను ఎట్లా ఎన్నిసార్లు మోసగించబడిందీ చెప్పింది. చెప్పి చెప్పి ఆమె హఠాత్తుగా నా కాళ్ళు పట్టుకొని "మీరు పెద్దఇంటివారు. చదువుకొన్నవారిలాగున్నారు. అందరిలా కాదు. మీ కళ్ళల్లో ఏదో కన్పిస్తున్నది. అలవాటులేని పని కెందుకువస్తారు. క్రొత్తవారు అని మొదటే తెలిసిపోయింది. కాకపోతే ఇంతసేపు నన్ను మాట్లాడించిం దెవరు? కూడు తిన్నావా అని అడిగిం దెవరు? ఇంత చెడ్డదాంతో మీకు సావాసం వద్దు-అదోలా చూడకండి. ఈ వెధవ వొళ్ళు భ్రమపెట్టేస్తుంది - నా కేదో మంచిదోవ చూపండి-ఇంకనుంచైనా నీతిగా బ్రతుకుతాను. మొట్టమొదటి తప్పు చెయ్యడమే తప్పు చెయ్యడం. అది నాతో వొద్దు-పోనీ నే నెళ్ళిపోతా - నన్ను పోనీయండి" అని ఏడుస్తూ వెళ్లిపోబోయింది. నేను ఆమె తలపై చేత్తో అదుముతూ కూర్చోమన్నాను. నాకు నిజంగానే జాలివేసింది. ఆమె మాటలమీద నమ్మకమూ కలిగింది. ఆమె ప్రవర్తన నా మనఃస్థితినే మార్చింది. అప్పటి నా మనఃస్థితిని తెలుసుకొనేందుకు కాబోలు ఆమె నా కళ్ళల్లోకి నేరుగా సూటిగా చూచింది.

ఎంతో గొప్పగా చూచిందామె.

ఆ చూపులో ఎంతో ఆశా, దైన్యమూ కన్పించాయి. 'ఈ ఒక్కసారీ తప్పుకాచి నాకు ఉరిశిక్ష తప్పించండి' అని వేడుకొంటున్నట్లుగా చూచింది. నాకు అప్పుడు ఒక భావన కలిగింది. ఆ భావన ఎంతో గర్వంతో కూడుకొన్నది. స్వీయ గౌరవాన్ని ఒక్కసారి లక్షరెట్లుగా పెంచేసుకొనే అవకాశం చిక్కినందుకు నా మనస్సు పొంగిపోయింది.

"అవును శతకోటిమానవుల్లో నే నొకణ్ణి. ఇతరుల దృష్టిలోనే కాకుండా తాపీగా ఆలోచించినప్పుడు నా దృష్టిలోనూ నేను అంతే ఒకా నొకణ్ణి. అట్లా కాకుండా కనీసము ఒక్క వ్యక్తి దృష్టిలోనైనా నేను అచ్చంగా అత్యుత్తముణ్ణిగా, దైవసమానుణ్ణిగా కన్పించ గలిగితే-అది ఎంతగొప్ప విషయం! ఈ పరిస్థితి అందుకే ఎక్కువ అనుకూలంగా ఉన్నది కనుక దీన్ని అందుకు వినియోగిస్తే-నిజమే" అనుకుంటూ ఆ పద్ధతిలో ఆలోచించాను.

మనస్సు సమాధాన పడ్డది.

ఆమె ఇంకా నా కాళ్ళను అనుకొనే ఉన్నది. నా చేయి అప్రయత్నంగా ఆమె తలపైనే ఉండిపోయింది. ఆ సమయంలో నేను నిజంగా మహా గొప్ప నిగ్రహం కలవాణ్ణిగా అనిపించింది. "ఏదో జీవిత సమస్యలతో, కొంత దారిద్ర్యంతో, కుటుంబ పరిస్థితుల్లో, పైకి రావాలనే కృషిలో, ఆయా ఇబ్బందుల్లో పడిపోయి ఉండిపోయాము గనుక పూర్వం ఈ రకపు తప్పులు నేను చెయ్యలేదు. అదీకాక అటువంటి సందర్భమే రాలేదు. చూశావా మరి వచ్చినప్పుడు కూడా నువ్వు నిగ్రహం చూపగలిగావు." అని నాకు నేనే చెప్పుకొని ఎంతో సంతోషించాను. అల్లా కలిగిన సంతోషాన్ని నిలుపుకొందామని పట్టుదల కలిగింది.

ఆమెకు ఆశ్రయం దొరికేచోటును గురించే ఆలోచిస్తున్నాను. "వానలోపడి ఇక్కడికెందుకు వచ్చావు?" అని అడిగాను యథాలాపంగా, లోపల ఆమె ముందుసంగతిని గురించే ఆలోచిస్తూ.

"వాన పెద్దయితే గుడిసె కురుస్తుంది నిలుచోడానికి చోటుండదు. అందుకని వచ్చా" అని సమాధానం చెప్పింది. మరో క్షణం నిశ్శబ్దంగా ఉండి "ఏం మీకోసమే వచ్చానను కొన్నారా ?" అని ప్రశ్నించింది.

"కాదనుకో" అని మాత్రమే నేను అనగలిగాను.

ఆమె మళ్ళీ ఏదో మాట్లాడడం మొదలుపెట్టింది. "తాను ప్రత్యేకంగా పనిగట్టుకొని ఇక్కడకు రానక్కర్లేదట. వర్షం లేకపోతే వెన్నెల్లో పెద్దయింటి వయిను మనుషుల ఎవరో ఒకరు షికారుకని అటు వస్తారట." ఏదో చెప్పుకొని పోతున్నది.

"నేనూ అలా వచ్చాననుకున్నావా ?"

"కాదుగాని - వలవేస్తే... " అని మొహమంతా పరచుకో బోతున్న చిరునవ్వు మొగ్గను తుంచేసింది.

"ఏం అంత సులభమనుకొన్నావా ? నా సంగతి నువ్వెర గవు." అన్నాను నేను ధీమాగా.

మునుపు కాదు పోవచ్చు - కాని - మునుపో నారి మీలాంటి వారొకరు తటస్థపడ్డారు. మొగుడు కొట్టాడు పారిపోతున్నా అని చెప్పేసరికి...

"మరి నాకు ఎందుకు చెప్పలా ?" వెధవబుద్ధి ఇంకా దొంకదారే పడుతున్నది. నేను వెంటనే మనస్సును కాస్త అదుపులోకి తెచ్చుకొన్నాను. ఆమె మళ్ళా మళ్ళా తనకు మంచి దారి చూపమని ప్రాధేయపడ్డది.

నేనూ అదే ఆలోచిస్తున్నానని సమాధానం చెప్పాను. ఆ సమయంలో నేను నిజంగా ఆ విషయమే ఆలోచిస్తున్నాను.

అనేక మంది పెద్దలు జ్ఞాపకం వచ్చారు.

ఏమైనా అవిడను నే నుండేస్థలానికి చాలా దూరంగా పంపాలని అనుకొన్నాను. "ఆమె కాస్త మంచిస్థితిలో నాకు మరోసారి ఇల్లాగే తటస్థపడితే నేను ఇప్పటిలా పట్టువల చూపగలనన్న నమ్మకం ఏమిటి" అన్న అనుమానంతో అల్లా నిశ్చయించుకొన్నాను. అల్లా ఆలోచిస్తుండగా చివరకు డాక్టరుగారి విషయం స్ఫురణకు వచ్చింది. "ఓ మంచి ఆలోచన" అనుకొని ఉబ్బిపోయాను. ఆయనా పెద్దవాడు. రెండు నర్సింగ్‌హోము లున్నాయి. మహానగరంలో పెద్ద ప్రాక్టీసు సాగిస్తున్నాడు - పైగా సంస్కరణాభిలాషి - ఆయన ఈమెకు సాయం చేయగలడు. ఇంతకుముందు ఇల్లా కొంత మందికి ఆయన సాయంచేశాడు. ముందేదయినా చిన్న ఆయా పని ఇచ్చి ఆమెను సరిదిద్దగలడు" అనుకొన్నాను.

ఆయనదగ్గరకువెళ్ళి ఎల్లా ఆశ్రయం సంపాదించాలో. ఒక పథకం ఆల్లేశాను. నా ఆలోచన పూర్తి అయ్యాక ఆమె కా విషయం వివరంగా చెప్పాను. ఆమె ఉబ్బి పోయింది. ఆమె ఉత్సాహంతో పొంగిపోయింది.

ముఖ మింతచేసుకొని చిరునవ్వులు చిందించింది. లేచి ఉల్లాసంగా అటూ ఇటూ తిరిగింది. "మీ మేలు మరువను సుమండీ." అని ఎంతో కృతజ్ఞత కనపరచింది. చివరకు "మరెప్పుడు వెళ్ళడం" అని అడిగింది. "నీ యిష్టం" అన్నాను. "ఎప్పుడో ఏమిటి ఇప్పుడే వెళతాను పంపండి. ఉండండి ఇప్పుడే వస్తాను" అని "అరెరె వానలో మళ్ళీ ఎక్కడికి"నేను అంటున్నా వినిపించుకోకుండా తనపాకవైపు పరుగెత్తింది.

అప్పటికి ఇంకా కొంచెం జల్లు పడుతూనేఉన్నది. ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్ళిన మనిషి గంటకయినా రాకపొయ్యేసరికి నా కెటూ తోచక ఊరికే ఆమె వెళ్ళినవైపే చూస్తూ కూర్చుండిపొయ్యాను.

* * *

"ఏమండీ డాక్టరుగారున్నారా?"ఎవరో నన్ను ప్రశ్నించారు.

స్మృతిపథాలలో విహరిస్తున్న నేను సాధారణపు స్థితికి వచ్చేసరికి కొంతసేపు పట్టింది.

ఆ వ్యక్తి నన్ను మళ్ళా అడిగాడు.

"ఉన్నారండీ - ఏదో ఆపరేషన్లో ఉన్నారు."

"సరే లెండి - మా అయ్యగారు కనుక్కొని రమ్మన్నారు. వెళ్ళి చెప్తాను" అంటూ అతను వెళ్ళిపోయాడు. "వీడెవడ్రా అంచక్కా సినిమా చూస్తున్నట్లుగా అప్పటి దృశ్యాలన్నీ స్ఫురణకు వస్తుంటే మధ్యలో ఆటంకం కలిగించాడు!" అని ఆ వచ్చి వెళ్లిన వ్యక్తిపై విసుక్కొన్నాను.

ఒకటి రెండు నిముషాలు ఎదురుగా గోడలమీద ఉన్న కాలెండర్లవంక చూస్తూ కూర్చున్నాను.

నిజమే ఆనాడు నేను చేసిన ఉపకారం చాలా స్వల్ప మైంది అని అనిపించింది. ఒక్క పదిరూపాయలతో అంత మంచిపని చెయ్యగలిగాను కదా అని ఇప్పటికీ సంతోషం గానే ఉన్నది.

"ఒక్క పదిరూపాయలు!" అనుకొన్నాను మళ్ళా. "అవు నవును. ఇప్పుడు పదిరూపాయ లంటే నీకు పెద్ద మొత్తంగా కన్పించడంలేదు కాని ఒకప్పుడో ?" అని ఎవరో ప్రశ్నించిన ట్లనిపించింది. అల్లా అనిపించడంతో ఒకనాటి నా ఆర్థిక ఇబ్బందుల తాలూకు జ్ఞాపకాలన్నీ వరదవాగుల్లా వచ్చి మనస్సు నంతటినీ కలచివేశాయి. భయం, బాధా కలిగాయి. "పోనీలే అవన్నీ ఇప్పుడెందుకు. ఎప్పుడో దారిలో పడ్డాను కదా!" అని గుండె దిటవుకొన్నాను. వరదతీసిన తర్వాత ప్రశాంతంగా కనిపించే ప్రవాహంలా నా ఆలోచన ఇక

సాఫీగా సాగిపోయింది. కుర్చీని బల్లకు దగ్గరగా లాక్కొని బల్లపై చేయి ఆనించి చేతిమీద తల వాల్చుకొని విశ్రాంతిగా డాక్టరుగారికోసం ఎదురు చూస్తూ ఉండిపోయాను. అప్పుడో క్షణం "పొరపాటున నా పేరు ఈయనతో చెప్పిందా ఏమిటి?" అని కొంచెం భయంవేసింది. కాని అంతలో ఆమెను రైల్లో ఎక్కించి నేను ప్లాటుఫారంమీద నిలబడి నేను చెప్పిన విషయాలూ, "అక్కడ చాలా జాగ్రత్తగా ఉండు. ఇబ్బందులు ఏవైనా వచ్చినా ధైర్యంగా ఎదుర్కోవడం నేర్చుకో. ఒక విషయంమాత్రం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకో-నీ పూర్వ పరిచితుల్ని ఎవర్నీ కలుసుకోకు. ఒక వేళ ఎవరైనా హఠాత్తుగా కన్పించినా ఏమీ ఎరగనట్లే తప్పించుకొని వెళ్ళు. నేను కన్పించినా అంతేసుమా. అక్కడ డాక్టరుగారితో నా పేరు పొరపాటునకూడా ఎప్పుడూ చెప్పకు. అసలూ ఎవరిపేర్లూ చెప్పవలసిన పనిలేదు. నీ అంతట నువ్వు వెళ్ళినట్లుగా వెళ్ళు ఆయన్ను ఆశ్రయించు. ఏ పని యిస్తే ఆ పనిలో మాట్లాడకుండా ప్రవేశించు. స్వయంగా గొప్ప కృషి చెయ్యి. అందుకు ఆయన సర్వ విధాలా తోడ్పడి నిన్ను పైకి తీసుకొని వస్తారు. ఆయన అమృత హృదయులు" అంటూ నేను నిదానంగా దూరం ఆలోచించి చెప్పిన మాటలూ, తీరా రైలుకదిలే వేళకు "ఉన్న ఊరూ, కొంపాగోడూ అన్నీ వదిలేసిపోతున్నా - అక్కడ ఎల్లా గడుస్తుందో ఏమో!" అంటూ అధైర్య పడి పోయి వెక్కి వెక్కి ఏడ్వడం. "అదుగో అదే వద్దన్నాను" నేను ఓదార్చడం... ఆ దృశ్యమూ అన్నీ చిత్రంగా స్ఫుర ణకు వచ్చాయి. "కనుక ఆ విషయంలో ఏమీ భయపడ క్కర్లేదు. అసలు అటువంటి దేమైనా జరిగిఉంటే ఆయన ముందే ఆ ప్రసక్తి తెచ్చేవారు" అనుకొన్నాను. "మాటల ధోరణిలో ఎంతో మార్పు కన్పించింది. ఇంక రూపంలో ఎంతమార్పు వచ్చి ఉంటుందో!.... కాని ఏమైనా సరే ఆవిడకు కన్పించకుండా వెళ్ళిపోవాలి-అవును నేను ఇందాక తొంగి చూడకపోవడం చాలా మంచిదయింది" అనుకొని అందుకు నన్ను నేను అభినందించుకొన్నాను.

కొంచెం గర్వపడ్డాను.

"చూచావా మరి నేనుకూడా మంచి తెలివిగలవాణ్ణి అవుతున్నాను" అనికూడా అనుకొన్నాను.

ఇంతలో చాలా దగ్గరగా నెమ్మదిగా ఏదో యథాలాపంగా అంటున్నట్లుగా అంటున్న మాటలు- "ఏమండీ మిమ్మల్ని డాక్టరుగారు ఉండమన్నారు. వస్తున్నానని చెప్పమన్నారు" అంటున్న మాటలు విన్పించాయి.

నేను తలఎత్తి చూచాను.

ఆమె నావంక చూడడంలేదు. బల్లమీద ఉన్న మందు చీటీల కట్టలు తీసి ఏ చీటీకోసమో వెదుకుతున్నది.

ఆ మనిషికి మంచిఛాయ వచ్చింది. ఎంతో ఆరోగ్యంగా, అందంగా, ఇటీవలనే కాపరానికి వెళ్లి పండుగకు పుట్టింటికి వచ్చిన పడుచులా ఉన్నది. జాగర్లమూడి తమలపుటాకులా ఆమె చెక్కిళ్ళు లేతగా నవనవలు కూర్చుకొన్నవిగా ఉన్నాయి. తెల్లటిదుస్తులు వేసుకొన్నది. కొంత బస్తీపోకడ నేర్చుకొన్నది.

ఆమెలో వచ్చిన మార్పు నన్ను అమితాశ్చర్య చకితుణ్ణి చేసింది. ఆమె తన పనిలో నిమగ్నమయ్యే "ఆపరేషను అయిపోయింది, వస్తున్నారులెండి" అన్నది అని ఎదుటివ్యక్తి తనవంక అదేపనిగా చూస్తున్నట్లు అనుమానపడి కాబోలు తనూ తలఎత్తి నావంక చూచింది. కాదు నా ముఖంలోకి, నా కళ్ళల్లోకి కాదు నా హృదయంలోకి చూచింది. అంతలో లేతగులాబీ రేకుల్లా ఉన్న ఆమెపెదిమలు ఎందుకో అదురుతున్నాయి. ఒక్కక్షణంలో నన్ను గుర్తుపట్టేసింది. "ఆరె మీరటండీ," అనేసింది.

నేను ఎప్పుడు లేచి నిల్చున్నానో నాకేతెలియదు. కాళ్లల్లో వణుకు పుట్టడంపట్టి అప్పుడు అరమైంది. ఎందుకో చెప్పలేని ఆనందం, ఆవేశం-అధైర్యం, ఆరాటం. ఇరుప్రక్కలా పట్టుకొని నన్ను ఊపివేశాయి. వెనుకటి విషయమంతా మెరుపుల వరుసలా జ్ఞాపకం వచ్చింది. అంతలో ఆమెరుపులు మాయమయ్యాయి. నాకేమీ తోచలేదు. తికమక పడి పోయాను. నేను చప్పున వెనక్కు తిరిగాను.

ఏమో అందామని, ఏమో చెప్పాలని అనుకొన్నానేగాని ఒక్క మాటైనా నోట్లోంచి పెకిలిరాకముందే వీథిగుమ్మం ఇవతలకు వచ్చేశాను. డాక్టరుగారి డిస్పెన్సరీకి పదిగజాల దూరంలో ఉన్న బస్సుస్టాపులో అప్పుడే ఒక బస్సు వచ్చి ఆగింది. ఒక్కపరుగున వెళ్ళి అందులో ఎక్కేశాను. "నీ తెలివి తెల్లవారినట్లే ఉన్నది. అది డాక్టరుగారి డిస్పెన్సరీ కదా పోనీ వాళ్ని కలుసుకోవాలని అంత ఆశపించినప్పుడు ఇంటికి వెళ్ళితే పొయ్యేదిగా-అప్పుడు నువ్వు అనుకొన్నట్లుగా సరిగ్గా నర్సింగ్‌హోములోనే పనిచేస్తున్నదని ఎందుకను కోవాలి? అయితేమాత్రం ఇంత అధైర్యమెందుకూ-అరెరె- ఏమిటిది గుండె ఇంత వేగంగా కొట్టుకొంటున్నది?" అని నన్నునేనే ప్రశ్నించుకొంటూ జరిగిన విషయం మర్చిపోదామన్న ప్రయత్నంలో కళ్ళు గట్టిగా మూసుకొన్నాను.

బస్సు దూరదూరంగా పరుగెత్తుకొని పోయింది.

# నిద్రా సమాధి | బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

నిదుర నెలంత శాంతపదనీరజమందు లలాట మాన్చి, జా
గ్రదుదిత ఘోరతాపమున కందిన డెందము కుందుతీర్ప వే
డెద ; "విరహాసహుండను - ఘటింపగ నీయకు నీ వియోగ మో
మదవతి! మంత్రదండ మొకమా రిటు త్రిప్పవె!" యంచు కోరెదన్!

ఆ నలినాక్షి కౌగిలి సమస్తరుజావినివారకమ్ము ; క్రో
ధానల, మీర్ష్యతాపము, భయాంధ్యము, మోహరజస్సు, లోభ ఝం
ఝానిల మెల్ల వ్రీలు నిముసమ్మున - నిద్దురబాల ప్రేమమై
మై నిమురన్, దివమ్మొరుగు మాడ్కిని వెచ్చని ముద్దుపెట్టినన్!

తరతమ భావముల్ చను కృతాంతుని సన్నిధిలోన నందు ; రా
తరతమ భావముల్ చనుగదా యిట నిద్దురలోన సైతమున్!
మరణము పొందు ముందుగనె మచ్చికచేసెడి మాతియౌనొకో -
నిరతము ప్రాణులన్ గలయు నిద్దుర చాల సుఖాలవాలయై!

తన కౌగింటను రాజు పేదయని వ్యత్యాసమ్ము లేదింత ; రా
జును పేదన్ పొనరించు, భిక్షుకుని రాజున్ జేసెడిన్ ప్రేల్మిడిన్!
ఘనమౌ పై తొడుగుల్ విదల్చి జను దేకాకారుడై గాని ని
ద్ర నెలంతన్ దరియంగ జాలడన - నిద్రా ప్రౌఢి తెల్లమ్మగున్!

పతి కాంతారము లేగె, వెంట జనగా వారించె, ఏమున్న దా
సతి కీ జాగ్రదవస్థ - నశ్రువులు, నిశ్శ్వాసమ్ములున్, శూన్యతా
పృత శుద్ధాంతము దక్క? స్వామి మరలన్ వేంచేయు పర్యంతమం
చిత నిద్రాన్వితమైన ఊర్మిళ తపస్సిద్ధిన్ ప్రశంసించెదన్!

అలసిన లోకపుం జనుల కల్లన జోలలువాడు నిద్రనే
అలతిగ నిద్రపుచ్చెనట - ఆత డొకండు సుమిత్ర పట్టి ; ని
శ్చలమతి నన్నకున్, వదినె జానకికిన్ పరిచర్యసేత యీ
గలిగిన శాంతి ముందు కొరగావొకొ వానికి నిద్రపోడుముల్!

లోకమ్ముల్ విజయించి, దిక్పతులు వేల్పుల్ తన్ను సేవించు శ్రీ
ప్రాకామ్యమ్ము భజించి, తల్లి కపచారమ్మెంచి, ఏ శాంతికిన్
ప్రాకన్ జాలక పోయె రావణుడు, నిద్రాయుక్తి నా శాంతినే
సాకన్ జాలెను కుంభకర్ణు; డుపహాసార్హుండు వాడెట్లగున్ ?

హతులౌ వెన్కనె సోమపీథులకు రంభాద్యప్సరోభామినీ
రతిభోగమ్ములు; బొందెతో నిటనె కైలాసమ్ము కూర్చున్ గదా !
ప్రతిరే ప్రాణులనెల్ల ప్రేమను పరీరంభించి ఈ స్వాప్నిక
ద్యుతిమత్ సుందరి ! దీనిప్రేమ గలుగన్ ద్యోలోక మింకేటికిన్ !!

వెన్నెలకోకతో, సిగను విచ్చిన చుక్కల మల్లెచెండుతో
ఎన్ని యుగాల వేదనల నిట్టె తొలంచెడు ఊర్పుగాడ్పుతో
కన్నుల కప్పురంపు పొడిగా నడయాడుచు రేయిరేయి ఓ
యన్నుల మిన్న ! కన్ తుదలయందు కలల్ విరజిమ్మిపోదువే !

క్షణికసుఖమ్ముగోరి, ఘనకమ్ము స్పృశించిన ఖాండమట్టులై
మును మునిపత్ని వందుర తపోవిధికిన్ జెడి, నీవ కాదటే
నెనరున నాదుకొంచు మలినీకృతజీవన మక్కజమ్ముగా
పునరమలీకృతమ్ము సలుపుం జవరాలవు సుప్తిసుందరీ !

పర రాట్పాలన కాలకూటవిషమై బాధింపగా వందలేం
డ్లౌరు లెవ్వారలు నిన్నువోలె నిదురా ! ఓదార్చి లాలించి రీ
భరతక్ష్మాజనులన్ ? వియోగము సహింపన్ లేమొయారీ ! నిరం
తర భోగమ్ముల దేల్పవే ! తెలివి చింతాకంత రానీయకే !!

నిదుర నెలంత పదమ్ముల
గదియించి శిరస్సు శాంతికై ప్రార్థింతున్
మది కాల్చివేయు ఈ జా
గ్రదవస్థ నిరస్తమౌటకై తపియింతున్.

అరిపిరాల విశ్వం | **"రాజశిల్పి"**

'రాజశిల్పి' ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే నుత్తమ నవలగా నిర్ణయింపఁబడిన గ్రంథము. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు జరిపిన పోటీలో 1957 సంllలో వచ్చిన పది గ్రంథములలో రెండు గ్రంథములు బహూకరణ యోగ్యములుగా నిర్ణయింపఁబడినవి. ఒకటి రాజశిల్పి. రెండు గృహరాజు మేడ. ఈ గ్రంథములు దోషలేశ వర్జితములు గాకున్నను. గుణబహుళములని కదా నిర్ణేతలు వీనినెన్నిక చేసిరి. అట్టిచో 'రాజశిల్పి' యందు గుణలేశమేని చూపక, ఏవో దోషములను నిరూపించుటకు శ్రీ విశ్వనాథరావుగారు ప్రయత్నించుట కేవలము లోకమును వంచించుటకే యని వేఱుగఁ జెప్పనక్కరలేదు. విశ్వనాథరావుగారు దోషములుగాఁ జూపినవి కొన్ని చరిత్ర విషయములు, కొన్ని యౌచిత్య విషయములు. అవి దోషములుగా చూపుటకు వారు చూపిన యుపపత్తులు మిగుల దుర్బలమైనవి. వారి యూహలకు, వారి యనుభవములకుఁ బ్రామాణికత్వము నారోపించుకొనుట, ఆ యుపపత్తుల ప్రధాన దౌర్బల్యము.

'అనౌచిత్యాదృతేనాన్యద్రసభంగస్య కారణం' అని సాహిత్య దార్శనికులు ప్రవచించినది పరమ సత్యమే. కాని ఔచిత్యానౌచిత్యములను నిర్ణయించుటకు విమర్శకున కధికారము కావలెను. ఆ సూత్రము తెలిసినంత మాత్రమున నధికారము లభింపదు. 'అహం బ్రహ్మోఽస్మి' యను మహావాక్యము తెలిసినంత మాత్రమున బ్రహ్మజ్ఞానము లభించునా? సూత్రములు వల్లించుట వేఱు. జ్ఞానము లభించుట వేఱు.

కాటయ వేమారెడ్డి పంపిన పల్లకియెక్కి వామనభట్టు ఆయన మందిరమునకు వచ్చెను. వేమారెడ్డియు ఆయన భార్య మల్లాంబికయు ఆతని కొఱ కెదురుచూచుచు చంద్రశాల వెనుకనుండిన యుద్యానవనమున నిలిచియుండిరి. కాటయ వేమారెడ్డి మల్లాంబిక కర్ణమూలమున మందారము చెరువుచుండెను. ఇది చంద్రశాల పశ్చిమ ద్వారమున కివ్వల జరుగుచున్నపని. వామనభట్టు చంద్రశాల పూర్వ ద్వారమున ప్రవేశించుచు, నాకస్మికముగ నా దృశ్యమును దిలకించెను. వేమారెడ్డి శాకుంతల నాటకమునకుఁ జేసిన వ్యాఖ్యానము నందలి యొక సన్నివేశము వామనుని మనస్సులోఁ దళుక్కున మెఱసెను. ఈ సన్నివేశ మనుచితమని విమర్శకుని తీర్పు. ఈ తీర్పునకుఁ గారణ మవిచారశీలత. కాటయ వేమారెడ్డి, మల్లాంబికల భవనముల మధ్య ఆరామ మున్నది. దాని ముందు చంద్రశాల యున్నది. వామనుని కొఱకుఁ గబురంపియుండిన ఆ దంపతులు చంద్రశాలలో నాతనిఁ గలిసికొనుటకై తమ తమ మందిరములనుండి వచ్చుచు నారామమునఁ గలిసికొనిరి. మల్లాంబిక గందపు పొడుమును దుడుచుట, వేమారెడ్డి మందారము నామె కర్ణమూలమునఁ దురుముట యచట జరిగిన యంశము. వామనభట్టు చంద్రశాల పూర్వ ద్వారమునఁ బ్రవేశించుచు నా దృశ్యమును జూచెను. అట్టి వేళ యాతఁడు వచ్చుటయే తప్పట. వచ్చి యా దృశ్యమును జూచుట తప్పట. చూచి తలవంచుకొనకుండుట తప్పట. ఇవి యేవియుఁ దప్పులు కావు. ఇవి తప్పులనుట యొక్కటయే తప్పు. కాటయ వేమారెడ్డియు, వామనభట్టును

బాల సఖులు, సహపాఠులు. ఇరువురను ఆదరించి కుమరగిరి ప్రభువు విద్యాబుద్ధులు చెప్పించెను. వామనభట్టు కుమరగిరి ప్రభువు మందిరముననను, కాటయ వేమారెడ్డి మందిరముననను జనవుగ సంచరించును. వారితోఁ జనవుగఁ బ్రవర్తించును, మాటలాడును. మల్లాంబిక కుమరగిరి రెడ్డికి లేక లేక కలిగిన చెల్లెలు. అందఱును ఆమెనల్లారు ముద్దుగఁ బెంచిరి. అన్నగారిని బట్టియు, భర్తను బట్టియు, మల్లాంబిక కడ, వామనభట్టునకుఁ గూడ కొంత చనవు కలదు. ఆతఁడెంత విద్వాంసుఁడైనను, బ్రాహ్మణుఁడైనను, అతనికి నమస్కారములు చేయుచు, వినయ విధేయతలు ప్రకటించుటామె కలవాటు లేదు. "క్రొత్తగా నీనమస్కారములేమి?" యని వామనుఁడనుట చిన్ననాటినుండి యున్న చనవును సూచించును. పదుమూఁడవ ప్రకరణములోఁ గాటయ వేమారెడ్డి మాళవికాగ్ని మిత్ర నాటకమునందలి పాత్రలను గూర్చి భావించుచు 'విదూషకుఁడచ్చముగా వామనభట్టే' యనుటవల్ల వేమారెడ్డికి వామనభట్టునకుఁ గల మైత్రియందలి రహస్యము తెలియుచున్నది. వామనభట్టాయనకు నర్మసచివ కల్పుఁడు. రాజకుటుంబములలో నర్మ సచివున కుండు చనవు సంస్కృత నాటకములు చదివినవారెల్ల రెఱిఁగినదే. అట్టి వారెవ్వరును పైన జెప్పఁబడిన సన్నివేశ మనుచితమని యనరు.

వామనభట్టు సమక్షమున "రాచపట్టువు పుట్టిన మల్లికాంబ సరసములాడుట యెట్లు పొసగును ?" పైని వివరింపఁబడిన యంశములను దృష్టియం దుంచుకొన్నచో "ఎట్లు పొసగునో" సహృదయులు, సాహిత్య సంప్రదాయజ్ఞులు గుర్తింపగలరు "అనౌచిత్యే" అన్న సూత్రము విమర్శకుని చేతిలోని వజ్రాయుధము. తన కిష్టములేని దానినెల్ల ఆ వజ్రాయుధముతో నరికి వేయవచ్చును.

"వామనుని గళమందలి బిరుదపతకమును జూచి మల్లాంబిక, ఈ మంగళసూత్ర మెక్కడిది" దను డనుచితమని విమర్శకుని తీర్పు. "పరపురుషుని మెడలోని బిరుదు పతకమునుజూచి మంగళసూత్ర మెక్కడిదని మేలమాడుట అభిజాత్యముగల కుల కాంత కపూర్వమైన విషయము." ఈ మాట సామాన్యోక్తిగా బాగుగనే యున్నదనిపించును. కాని "పరపురుషుఁ"డన్నమాట కర్థము విచారించ వలెను. సతికి పతి తప్ప ఇతర పురుషు లందఱును పరపురుషులే. తండ్రి, అన్న, తమ్ముఁడు, బావ, మఱది, మేనమామ, పురోహితుఁడు, వైద్యుఁడు, గురువు కుటుంబముయొక్క చిరకాల మిత్రులు, భర్తనర్మసచివుడు వీరందఱును బరపురుషులే. కాని ఈ పరపురుషత్వమందలి తారతమ్యములు గుర్తింప వలెనుగదా వామనభట్టు కాటయ వేమారెడ్డికి నర్మసచివకల్పుఁడనియు, కుమరగిరి ప్రభువునాదర మునకు పాత్రుఁడైనవాఁడనియు మల్లాంబికను బాల్యమునుండియు సన్నిహితముగా నెఱింగిన వాడనియు గ్రంథమున గలదని పైన చెప్పఁబడినది. ఈ అంశములన్నియు దృష్టియం దిడుకొని, మల్లాంబికకు వామనభట్టెంత పరుఁడన్న విషయము నిర్ణయింపవలెను. పతియొక్క నర్మసచివునితో, పతి సమక్షమున నొక్క మేలపు మాటయాడుట ఆభిజాత్యమునకును, పాతివ్రత్యమునకును భంగ మనుటెంతవఱకు సమంజసమో సహృదయయులు నిర్ణయించుకొందురుగాక.

"మంగళసూత్ర మెచ్చటి"దని మల్లాంబిక అనుట "హరిహరరాయలవారు కట్టిన"దని, వామనుఁడు బదులు చెప్పుట "కొండవీటికిని విద్యానగరమునకు బెండ్లి కుదిర్చితివన్నమాట"యని వేమారెడ్డియనుట ఉత్తర కథార్థ సూచనకై చేసిన చేతకాని కల్పన యట. "సూచన వ్యంగ్యముగా నుండవలెనుగాని బట్టబయలు కారా"దని విమర్శకుని తీర్పు. గ్రంథమును మొదటిసారి చదువునప్పుడు సూచన లన్నియు గుట్టుగానే యుండును. రెండవసారి చదువునప్పుడవియన్నియు బట్టబయలుగానే యుండును. ఎట్టి వ్యంగ్యమైనను చిట్టచివరకు బట్టబయలు కావలసినదేకదా.

విజయనగర రాజకుమారి హీరాంబిక యక్షర ములు ముద్దుగొలుపుచున్నవని కాటయ వేముఁడనగా మల్లాంబిక తన చేతిలోని మల్లెపూవుతో, వామనభట్టు యెదుటనే భర్తనుగొట్టి వెళ్ళిపోవును. ఇట్లు చిత్రించుటచే మల్లాంబికా కాటయ వేముల శృంగారము తక్కువ రకపు సినిమా శృంగారముగా దిగజారిపోయినదని విమర్శకులు తీర్పు చేసినారు. ఈ తీర్పున కాధారమేమి ? సినిమా శృంగారమని యొకజాతి శృంగారమున్నదా ?

ఇంతకును ఇచ్చటి దోషమేమి ? మల్లాంబిక భర్తను మల్లెపూవుతో గొట్టుట దోషమా ? వామనభట్టు నెదుట గొట్టుట దోషమా ? మొదటిదైనచో సత్యభామ మగనిని "అచ్చో వామ పాదంబునన్ దొలగంద్రోచె?" నన్నదాని కన్న దోషమా ? రెండవదియగుచో నర్మసచివుని సమక్షమున నాయిక మానక్రోధ వశమున మల్లెపూవును నాయకునిపై విసరుట సాహిత్య సంప్రదాయముల కెంతమాత్రమును విరుద్ధముగాదని, సహృదయు లెఱుఁగుదురు, శాకుంతల నాటక ప్రథమాంకమున ననసూయా ప్రియంవదలసమక్షమున దుష్యంతుడు "వైఖానసం కిమనయా వ్రత మాప్రదానా ద్వ్యాపారరోధి మదనస్య నిషేవితవ్యం...." "అద్యాపి స్తనవేపథుం న జహాతి శ్వాసాః ప్రమాణాధికాః" ఇత్యాది మదనవ్యాపార, స్తనవేపథు ప్రసంగ ముచితమేనా ? మహాభారతమున నన్నయగారు శకుంతలచే దుష్యంతునకు స్వజన్మ వృత్తాంతమును జెప్పించుచు "వర్ధ కుచంబులు కక్షయుగ్మమున్" ఇత్యాది ప్రసంగములు చేయించుటుచితమేనా ? ఇట్టివి సంస్కృతాంధ్ర కావ్య నాటకాదులందు సహస్రములుగా నున్నవి. రసప్రలుబ్ధ బుద్ధులగు సహృదయు లెవ్వరును వీనిని దోషములనలేదు. రంధ్రాన్వేషణైక శీలియగువాఁడివి యన్నియు దోషములనును.

మల్లాంబిక కుమరగిరి ప్రభువు ముద్దు చెల్లెలు. కాటయ వేమారెడ్డి సామాన్య కుటుంబమునకుఁ జెందినవాఁడు. కుమరగిరి యాతని మూర్తిమత్త్వముచేతను, ప్రతిభాశాలిత చేతను నాకృష్టుఁడై యతనికి బాల్యమునుండి విద్యాబుద్ధులు చెప్పించి సాహిత్యమున, నాట్యశాస్త్రమున, రాజనీతి శాస్త్రమున నిష్ణాతుని గావించి, చెల్లెలి నిచ్చి పెండ్లిచేసి తనకు ప్రధానిని గావించుకొనెను. "మగని చిత్తము నేకపత్నిగ నేలుకొనుచుంటినను గర్వము మల్లాంబికకు గాఢముగ గలదు. తానెన్ని పర్యాయములు మూతిముడిచినను భర్తయే తన్ను ప్రసన్నురాలి నొనర్చుచుండెను. అది యామెకు మరింత యలుసయ్యెను. తాను రాజ సహోదరి ననియు, దన్ను బెండ్లాడుటచేతనే యాయనకు మంత్రి పదవి లభించెననియు దురభిమానరేఖ మల్లాంబిక మనసు మారుమూల నెచ్చటనో లేక పోలేదు. కాటయ వేమారెడ్డికది తెలియకయును పోలేదు. మల్లాంబిక యిందలి చురుకుదనమునకీ యాభిజాత్యాభిమానమే కారణము. ఆ చురుకుదనము కాటయ వేమారెడ్డి కిష్టము. మల్లాంబిక వట్టి ముద్దరాలైనచో నెట్లుండునో యని యప్పుడప్పు డాయన యాలోచించుకొని నవ్వుకొనుచుండును. మల్లాంబిక కీ యభిమానమభిమానమే, మగనిపై వలపు వలపే మగని యందమున కామె మురిసి పోవుచుండును" గ్రంథమున పంద్రెండవ ప్రకరణమున మల్లాంబిక స్వభావమిట్లుగా వర్ణింపఁబడినది. విమర్శచేయదలచిన వారిట్టి యంశము లన్నియు ననుసంధించుకోవలయును. ఏ సన్ని వేశమున కాసన్ని వేశమునే తీసికొని తీర్పులు చెప్పగూడదు. గ్రంథార్థమును సర్వమును నేకదృష్టితో గ్రహించు శక్తి చాలనిచో విమర్శజోలికి పోరాదు.

అసలు గ్రంథమం దిట్లున్నది. "స్వర్ణలతా పరిష్కృతమైన ముఖపత్రముపై "శృంగార భూషణ బాణః సాహిత్య చూడామణి వామనభట్ట విరచితః" అని చదివి వేమారెడ్డి "ఈ యక్షరశిల్పి యెవరు ?" అని యడిగెను. "రాజకుమారి హేరాంబిక" యని వామనుఁ డుత్సాహము

మెఱయ బదులు పలికెను. "ముత్యాల కోవవలె ముద్దులుగొల్పుచున్న"దని వేమారెడ్డి మెచ్చుకొనుచుండ, "సిగనుండి జారిన మల్లెపూవును మునివ్రేళ్ళతోఁ ద్రిప్పుచు నక్షరముల యందమున కచ్చెరు వందుచుండిన మల్లాంబిక మగనిమాటకు మొగమింత చేసికొని చేతిలోని మల్లెపూవు నాతనిపై విసరి చివాలున లేచిపోయెను. వామనుని మోము తెల్లబోయెను. వేమారెడ్డి మనస్సునం దేదో వింత భావము స్ఫురించి యాతని కపోలములం దెఱుపు చాయ లీలగా దోచెను".

"వామపాదంబునం దొలఁగఁ ద్రోచె లతాంగి" యన్న ముక్కు తిమ్మనగారి ముద్దుపలుకులను "ఎడమ కాలితో మగనితలపై దన్నెనని" యనువదించుట యెట్టిదో "చేతిలోని మల్లెపూవు నాతనిపై విసరి చివాలున లేచిపోయెను" అన్న మాటలను "చేతిలోని మల్లెపూవుతో వామనుని సమక్షముననే మగనిని గొట్టి వెళ్లిపోయెను" అని యనువదించుటయు నట్టిదే.

"మల్లాంబిక గంధపుష్పాక్షతలతోడి బంగరు పళ్ళెరమున కర్పూరము వెలిగించి మంగళకైశికీ వృత్తిని కుమరగిరి ప్రభువునకు వందన గీతము పాడె"నని రచయిత వ్రాసినారు.

"ఇది రాజసంప్రదాయ మెఱుఁగని రచన రాజుల యిండ్లలో మంగళహారతులు దాసీలే పట్టుదురు. అట్లు మంగళహారతులు పట్టినవాళ్ళకు బహుమానములనిచ్చు సంప్రదాయము గలదు"అని విమర్శకులు సెలవిచ్చినారు. రాజసంప్రదాయ మనగా నేరాజసంప్రదాయమని ఈ విమర్శకుని ప్రశ్నించుచున్నాను. రాజుల యిండ్లలో దాసీలే మంగళహారతులు పట్టుదురన్నచో వెలమరాజుల యిండ్లలోనా ? రెడ్డిరాజుల యిండ్లలోనా యని ప్రశ్నించుచున్నాను. వెలమరాజుల యిండ్లలో నీ యాచారమున్నంత మాత్రమున రెడ్డి రాజుల యిండ్లలో నున్నదని, నిర్ధారణచేయ వీలుగాదు. పళ్ళెరమును దాసీలే మోసినను మంగళాచరణరూపమైన హారతి నిచ్చుట స్వకుటుంబములోని వారే చేయుట యుచితము. ఈ యౌచిత్యముకొఱకే గ్రంథకర్త యిట్లు వ్రాసియుండును. ఇదమిత్థమని నిర్ణయించుటకు నిష్కృష్ట ప్రమాణములులేని యిట్టి యాచార సంప్రదాయ విషయికమైన యల్పవైరుధ్యములు రసభంజన సమర్థములు కావు.

ఇట్లే కుమరగిరి రెడ్డి యుద్విగ్న చిత్తమును, కుమరగిరి పుత్రుని మరణావస్థయందలి యశాంతిని ప్రశమింపఁజేయుటకై మల్లాంబిక తన గాన విద్య నుపయోగించుటను విమర్శకు లధిక్షేపించినారు. అవి "పాటకచ్చేరీ" లని మల్లాంబిక యాస్థాన విద్వాంసురాలు కాదని విమర్శకులనుట దుర్మార్గావలంబనము. విమర్శకు డాసన్నివేశమును వికృతము గావించి విపరీతార్థకల్పనము జేసినాడు. కొంత యుదాహరించుట యుచితము.

"మల్లాంబిక తారమునుండి మధ్యమునకు, మధ్యమునుండి మంద్రమునకు, నంచెలంచెలుగ నల్లనల్లన దిగివచ్చుచుండెను. కుమరగిరి ప్రభువు నుద్వేగము చేతితో దిగిచినట్లు మస్తిష్కమునుండి యల్లనల్లనఁ బాదాగ్రములకు దిగివచ్చుచుండెను. మల్లాంబిక మంద్రషడ్జము నంతర్ముఖముగావించి యనాహతమునఁ గుంభించెను. పాదాంగుళ్యగ్రములనుండి స్రవించి ప్రభువుద్వేగ మనంత వాయువుల గలసిపోయెను. ఆయన యొకానొక మధురస్వప్నమును దర్శించుచున్నట్లు అధరమున విరిసిన యచ్చఁపుఁ జిఱునవ్వుతో నాననమునఁ దాండవించు నానందరేఖతోఁ దన శిల్పముల నడుమఁ దానొక శిల్పమువలె శయ్యాగతుఁ డయ్యెను. శిల్పమందిరమంతయు నిర్వికారము. నిశ్చలము, నిశ్శబ్దము."

ఈ వర్ణనము శృంగారాభిముఖముగ నున్న దన్న విమర్శకుని రసగ్రహణ పారీణత స్పష్టమగుచునేయున్నదికదా !

"కుమరగిరి రెడ్డియందు పురుషోచిత లక్షణములు గూడ యీ గ్రంథమందు కన్పించవు."

అనుటకు చరిత్ర తెలియకపోవుటయు, 'రాజశిల్పి' నవలయందు కుమరగిరి తత్త్వము గుర్తింపఁజాలక పోవుటయు గారణములు. కుమరగిరి యుద్ధ వీరుఁడుగా గాని పాలనా దక్షుఁడుగా గాని చరిత్ర యందు ప్రసిద్ధికెక్కలేదు. లలితకళా ప్రియుఁడుగా బ్రసిద్ధిగాంచినవాఁడు. తండ్రియు, పినతండ్రియు రాజ్యభారము వహించుచుండ నాయన శిల్పములు నిర్మించుకొనుచుఁ గాలక్షేపము చేయుచుండెను. పినతండ్రి యనంతరము రాజ్యమునఁగల్లోలము బయలుదేరగా శ్రీకృష్ణుఁడు ధర్మరాజునువలె; గాటయ వేముఁడు కుమరగిరిని సింహాసనమున నిలువఁ బెట్టెనని చరిత్ర చెప్పుచున్నది. "సింహాసనే నిధాయాసౌ కుమారగిరి భూవరమ్, అతేజయ న్మహో తేజః శ్రీకృష్ణ ఇవ ధర్మజం." కుమరగిరి వీర కృత్యము లాచరింప వలసిన యవసర మెన్నఁడును గలుగలేదు. కాని యీ నవలయందు కాటయ వేముఁడు చేసిన వీర కార్యములన్నింటిని ప్రేరణ శక్తి కుమరగిరియే యని సూచింపఁబడినది. భార్యా వియోగమువల్ల, పుత్రుని ప్రాణాంతక వ్యాధివల్ల గాఢమైన దుఃఖమునకు వశుఁడైన కుమరగిరి రెడ్డికి ఉత్సాహము, ఆనందము, కలిగించుట కొఱకే, వేమారెడ్డి యుద్ధములుచేసి, రాజ్యమును విస్తరింపఁజేసెను. కుమరగిరి రెడ్డి యంతర్ముఖుఁడు. వట్టి సత్వపు ముద్ద. ఆయన యీ గ్రంథమునందు శిల్పిగనేకాక, తాను గూడ నొక శిల్పమేయై పోయినట్లు రూపింపఁబడినాఁడు. ఆయా తావు లందు మాణిక్య శిల్పముగ, దంతపు శిల్పముగఁ గాంచన శిల్పముగ నాయన వర్ణింపఁబడి యున్నాఁడు. చరిత్రయందలి, కుమరగిరి రెడ్డి జీవిత మునకు 'రాజశిల్పి' రమణీయమైన వ్యాఖ్యానమని గ్రంథము చదివిన వారెల్లఱును గ్రహింపఁగలరు.

కుమరగిరి రెడ్డియు, కాటయ వేమారెడ్డియు, కలిసికొన్న సన్నివేశము నాయికా నాయకులు కలిసికొన్నట్లున్నదనియు, అట్లు చిత్రించుట ఉంత వ్యముగాదనియు విమర్శకులు వ్రాసినారు. ఆ సన్నివేశము గ్రంథమందిట్లు వర్ణింపఁబడియున్నది.

"కాటయ వేమారెడ్డి, ప్రభువు నేకాంతమున దర్శించి, తన యభిప్రాయమును నివేదించెను. ప్రభువు కన్నులింత జేసికొని కాటయవేమారెడ్డిని చూపులతోఁ గౌగిలించెను. వాడిపోయిన లేమావి చిగురులవంటి యాయన పెదవు లప్రయత్నముగ నించుక విరిసి, చిఱునవ్వు రూపుదాల్చెను. గాఢాలింగనమునఁ దన్ను బొదివికొని యానందాశ్రువులఁ దన్నభిషేకించుచున్న ప్రభువు పరిష్వంగ బంధము సడలుట గుర్తించి, కాటయ వేమారెడ్డి యాయనకంటి నీటిని గరాగ్రమునఁ బరామర్శించుచు, 'ప్రభువులు ప్రసన్నచిత్తులు కావలెను. ప్రభువులుఖిన్నులైనచోఁ గొండపిడు చిన్నబోవును. నరసింహపండితుని వాణి యమోఘమైనది. సర్వము సంపన్నము గాగలదు. ప్రభువు చిఱునవ్వులు కలకాలమిట్లే కొండవీటికి వెన్నెలగొడుగు పట్టగలవు.' ఇట్లనుచుఁ గాటయవేమారెడ్డి కుమరగిరి ప్రభుని కన్నులలోనికిఁ జూచెను. పక్ష్మాంచల సంలగ్నములగు నశ్రుకణము లస్పృశించుకొనుచు నాయన ముద్దుల మఱంది [illegible]గమును మోహపుఁ జూపులఁ ముద్దులాడెను. [illegible]మిల మెరయు నాయన కనుపాపలలోఁ గాటయ వేమారెడ్డికి దనమూర్తి యగపడెను. ఆ మూర్తికిఁ బ్రభువు కనురెప్పలు ముత్యాలగొడుగులు పట్టినట్లుండెను."

ఎట్టి ప్రాకృత బుద్ధియు నిది నాయికానాయకుల సమావేశమని భ్రమపడఁడు. కౌగిలించుకొనుట నాయికానాయకులు తప్ప యెవ్వరును జేయరా? విశ్వనాథ సత్యనారాయణగారి ఏకవీరలో కుట్టాన్ వీరభూపతుల సమావేశమిట్లు వర్ణింపఁబడియున్నది. "నేనా స్త్రీని ప్రేమించలేకున్నాను. నీకోసమని ప్రేమించమందువా? ప్రేమించెదను. ప్రేమించెదను. వీరా! యత్నము చేసెదను. కాలముపట్టునట్లున్నది. క్షమింపుమని కుట్టాన్ వెక్కి వెక్కి యేడ్వ మొదలుపెట్టినాఁడు. వీరభూపతి యతనిని గాఢముగాఁ గౌగిలించుకొని యతని శిరస్సు మూర్కొని...."

సీతావిరహార్తుఁడైన శ్రీరామచంద్రుని ప్రసన్నుని జేయుటకై, లక్ష్మణస్వామి యాయనకు సీతవలె పరిచర్యచేసినట్లు సత్యనారాయణగారీ క్రింది పద్యమున వర్ణించినారు.

"సీతవలె నన్న జట సరిచేసి, యుత్త
రీయమును సర్ది, ధనువు చేరిచి బుజాన
పొడుచు కన్నులఁగన నన్న మొగము మంద
హాసమునఁ జూచెడిని సుమిత్రాసుతుండు."

మానవస్వభావమందలి గాంభీర్యమును, ఆర్ద్రితను, మాధుర్యమును, దివ్యత్వమును దర్శించిన వారు గాని యిట్లు వ్రాయలేరు. ఇట్టి సన్నివేశముల యందలి రమణీయతను స్వాదించుటకు స్వచ్ఛమైన హృదయ ముండవలెను. మలినమైన మనో ముకురమునఁ గావ్యార్థము లెట్లు వికృతముగా రూపు కట్టునో ఈ పట్టున విమర్శకుఁడు ప్రకటించిన భావములే స్పష్టముగా నిరూపించుచున్నవి.

శ్రీనాథుఁడు పేరు మార్చుకొన్న యంశమును ప్రస్తావించుచు "ఈ వెధవ తెలుఁగుపేరు నాకసహ్యముగా నున్నది" అని శ్రీనాథునిచే ననిపించుట దేశద్రోహమువంటిదని విమర్శకు లన్నారు. ఇది కూడ విమర్శకుల వంచనలో నొక యంగమే. శ్రీనాథుఁ డన్నది "వెధవ తెలుఁగుపేరు"అనిగదా. ఇందు 'వెధవ' అన్న పదము పేరునకుఁ జెందునా? తెలుఁగునకుఁ జెందునా? వెధవ, తెలుఁగు అన్న రెండు పదములును పేరుఅను పదమునకు విశేషణములని తెలిసికొనుటకు పెద్ద పాండిత్య మక్కర లేదు. శ్రీనాథున కసహ్యముగనున్నది పేరుగాని, తెలుఁగు గాదనుట సుస్పష్టమే.

"ప్రౌఢి పరికింప సంస్కృత భాషయండ్రు
పల్కు నుడికారమునఁ దెల్గు భాషయండ్రు
ఎవ్వరేమనుకొన్న నాకేమి కొదువ
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష"

అని శ్రీనాథుఁడే యనెనుగదా! దీనికి విమర్శకులేమందురు?

రాజశిల్పియందు చిత్రింపబడిన శ్రీనాథుడు పదునాఱేండ్ల నవ యువకుడు. పదునాఱేండ్ల వయస్సున శ్రీనాథు డెట్లుండెనో గ్రంథకర్త చక్కగా నూహించి చిత్రించెనని రాజశిల్పి పఠించినవారు గుర్తింపఁగలరు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగార శ్రీనాథము, కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారి యాంధ్రుల సాంఘిక చరిత్రము, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి రెడ్డి రాజుల చరిత్రయు చదివినచో రాజశిల్పియందు శ్రీనాథుని కథయేకాక నాటి చరిత్రయంతయుఁ జక్కఁగా సమన్వయింపఁబడి వ్యాఖ్యానింపబడినదని గ్రహింపగలరు.

"బూడిద బుంగవై......" అన్న పద్యమును గురించి "ఈ పద్యము కొండవీటిలోని అసమర్థులైన కవుల నపహాస్యము చేయుటకు వ్రాయబడినది". అని విమర్శకులన్నారు. ఇది నిరాధారమైన వాక్యము. ఇది శ్రీనాథుని చాటువు. ఏ సందర్భమున నేనాడు చెప్పెనో నిర్ధరింప వీలులేదు. రాజశిల్పియందలి యీ సన్నివేశముల నవధరించి యీ పద్యమును శ్రీనాథుఁడా సందర్భమున జెప్పియుండుననుట సహజముగ, సమంజసముగ నున్నదో లేదో సహృదయులు నిర్ణయింతురుగాక.

"మట్ట మధ్యాహ్నము. వసంతకాలపు జిఱుత యెండలు చురుకు చురుక్కు మనుచుండెను. ధూళిధూసరితములగు జీర్ణవసనములవాఁడు, వికీర్ణమై, పింగళవర్ణమైన కేశకలాపమువాఁడు, కంఠావలగ్నమైన యిష్టలింగమువాఁడు నూనూగు మీసములవాఁడు యువకుఁ డొకడు కొండవీటి కోట వాకిటికి వచ్చెను......

కొండవీటి కవులని గురించి ద్వార రక్షకుఁడన్న మాట శ్రీనాథుని చెవులలో రింగుమనుచుండెను. అతఁడు తన మేనమామయగు తిప్పయ్యగారి యింటికై యూరంతయు దిరిగెను. పండుగ విలాసములలోనుండి యెవ్వరు నతనికి ఆహ్వానము చెప్పరైరి.

"కొండవీటి పురుషుల యందము తనకీర్ష్య పుట్టించుచున్నది. కొండవీటి స్త్రీలయందము తన్ను లోభపెట్టుచున్నది తనకు సౌందర్యమనప్రాణము. అది యుండిన తనకాకలి దప్పులగపడవు. లోలుప ములగు తన చూపులు సుందర రూపములవైపు సాగి తిరస్కారతాడితములై తనకే గ్రుచ్చుకొను చున్నవి......ఇతరుల యొడళ్ళ కలంకారమైన కస్తూరి తన యొడలికిగళంకమైనది. అతని కన్నుల యెదుట జీకటి కస్తూరి రాశివలె గ్రమ్ముచున్నది. కస్తూరికా మదముచే కావలె నతని తల గిఱ్ఱున దిరుగుచున్నది. అతఁడట్లే కాళ్ళీడ్చుకొనుచు జాకలి వాడ సందుగొందుల దిరుగుచుండెను."

కొండవీటి కవులు పంచకళ్యాణి గుఱ్ఱములవలె నుందురు. అనిన ద్వార రక్షకుని మాటయు, దన యప్పటి దుస్థితియు, నెదుట గాడిద యోండ్ర పెట్టుటయు, ఆకలిదీరి వదనమున జిఱునవ్వు దొలుకాడు శ్రీనాథుని గళమునుండి యప్రయత్న ముగ నీ పద్య మల్లుకొనివచ్చుటయు సహజ రమణీయముగ నున్నవి.

'జీవునకు జాగృతియే కృతకము. స్వప్నమే సహజ'మన్న విషయమును పీరు విమర్శించిరి. స్వప్న విషయములను జీవశాస్త్రదృష్ట్యా పరిశీలించిన పెద్దలు **'Dream is a wish fulfilment'** అనినారు. స్వప్నశాస్త్రమున నీ క్రింది యంశము లన్నియుఁ జర్చింపఁబడును. 1. స్వప్న మెందుకు వచ్చును? 2. స్వప్న మిట్లెందుకు వచ్చెను? 3. స్వప్నమిట్లు వచ్చుటచే ఫలమేమి? స్వప్న మెందుకు వచ్చె నన్నది జీవశాస్త్ర సంబంధియైన ప్రశ్న. స్వప్న మిట్లెందుకు వచ్చె నన్నది మన శాస్త్రసంబంధమైన ప్రశ్న.

జీవునకు భయవాంఛాదులైన కొన్నినిసర్గ లక్షణము లుండును. ఇవి నెరవేరుటకు సాంఘికాచారాద్యవరోధము లుండును. అందుచే మనుష్యులు లోపలి భావములను వెలికి రానీక, అవి వస్తుతః లేనట్లే ప్రవర్తింతురు. స్వప్నమందీ సాంఘికాద్యవరోధములు లేవు. కనుక జీవుఁడు తన సహజ భావములతో స్వప్నమున జీవించును. కనుక జీవున కదియే సహజమని, వ్యావహారిక నిత్యజీవితము కృతకమని శాస్త్రజ్ఞులందఱు నంగీకరించిన విషయమే. జాగ్రదవస్థలోనుండు విరుద్ధాంశములను సమన్వయపరచుకొనుటకు జీవుఁడు చేయు ప్రయత్నమే స్వప్నమని రెవర్స్ అను స్వప్నశాస్త్రవేత్త చెప్పెను.

"నాటకములందు స్త్రీ వేషములను ధరించు భాగవతుల బుచ్చిగాణ్ణి చూచి మోహములు పొంది కొండవీటి యువరసికు లొడళ్లు గొంకరలుపోవుట—ఇట్లు చెప్పుట జుగుప్సావహముగా నున్న" దని విమర్శకులు వ్రాసినారు. అస లందున్న సందర్భమును సహృదయులు పరిశీలించుటకు వివరించెదను. "వసంతోత్సవములోఁ గొండవీటఁ దమ నాటకములను బ్రదర్శించుటకై పెండెలనాగియు, భాగోతుల బుచ్చిగాడును, బ్రతివర్షము వతనుగా వచ్చుచుందురు. పెండెలనాగి పామర జనముల పాలిటి యచ్చర. ఎంతవారికోగాని దర్శనము లభింపదు. ప్రభువులను దప్ప నది యన్యుల దర్శింపఁబోదు. దాని దర్శన మందని యువకులందఱు బుచ్చిగాని భక్తబృందమున జేరుచుందురు. వాని నిట్లు పొగడుదురు. "వాఁడు నిజముగ నాఁడుదియేయైనచో నేలికలనే యేలుకొని యుండునని యందురు. ఆ పొగడితల కాతఁడు పూలతీవవలె మెలికలు తిరిగి పోవును. ఆ మెలికలకు మోహములు పొంది రసిక యువకు లొడళ్ళ గొంకరలు వోదురు."

"మోహము"నకు భోగాభిలాషయని యర్థము కాదు. మోహమునకు పారవశ్యమనియే యర్థము. "అవధీః కామమోహితమ్" యన్నచోట కామము చేతఁ బారవశ్యమునందె యని యర్థము. అదే యర్థములో నన్నయభట్టు "పుత్రప్రేమ మోహితుండయి" "సురాపాన మోహింతుండయి" యని ప్రయోగించినాఁడు. శరీరము కొంకరలు వోవుట యన్న దా పారవశ్యపు బాహిర లక్షణము. సౌందర్య దిదృక్షయే రసికత. అనఁగా సౌందర్య

సారజ్ఞత. ఆ సౌందర్య సారము స్త్రీగతమా, పురుషగతమా యన్నది పామరబుద్ధికి చెందినదిగాని సౌందర్య రసతత్త్వమును దెలిసినవానికి దానితో బనిలేదు. సౌందర్యమనెడు ధర్మము నాస్వాదించుటయే యాతని పనిగాని, ఆ ధర్మముగల ధర్మి నుపభోగించుటాతని తాత్పర్యము గాదు. పుంసాం మోహనరూపాయ అని రామచంద్రుని గూర్చి చెప్పబడినది. 'చూచిన మగలైన చొక్కెడునట్టి' అని తిక్కన మనుమసిద్ధిని గూర్చి చెప్పెను.

లోకములో నెందరో గొప్ప వారుందురు. వారిలోఁ గొందరి చిత్రములు మన యిండ్లయందుండవచ్చును. వాని మధ్య మన తండ్రిదో, తాతదో చిత్రముండవచ్చును. ఈ చిత్రము మిగిలిన వానికన్న పెద్దది కావచ్చును. అంతమాత్రముచే మన తాత తండ్రులు ఆ చిత్రములందున్న వారి కంటె గొప్పవారని యర్థము కాదు గదా! ఒక చిత్రము పెద్దదిగానున్నదన్నచో నా చిత్రగత వ్యక్తియందభిమానము మెండని యర్థమే కాని, ఇతర చిత్రములయందున్న వ్యక్తులకంటె నీ చిత్రమునందున్న వ్యక్తి యధికుఁడని యర్థము కాదు. అట్లర్థము చేసికొనుట కేవలము పసితనము. నన్నయకంటె తిక్కన గొప్పవాఁడు కాఁడని యనంతుని యభిప్రాయమైనట్లు గ్రంథమునందే కలదు. వారి మార్గములు వేఱనియు, అందు తిక్కనమార్గమునే ప్రజలును, కవులును గొప్పగా కొనియాడిరనియు, ననంతుఁడు చెప్పెను. తన యభిప్రాయము కూడ నదియే యైనట్లు సూచించెను. వారి మార్గములు భిన్నములు. ఎవరిమార్గమున వారు గొప్పవారే. ఇచ్చట నన్నయ తిక్కనల మార్గముల తారతమ్యమే యున్నది కాని, నన్నయ తిక్కనల గొప్పతనముల తారతమ్యము లేదు. ఈ రహస్యమును గుర్తించకపోవుటచేతనే, విమర్శకులిచట ఏనుగును జీమను బ్రవేశపెట్టినారు.

గజరావు తిప్పానాయకుఁడు పెదవేదగిరి నాయనికి సవతి తమ్ముఁడు కాఁడని సోపపత్తికముగ నిరూపించి, వీరు చూపిన చారిత్రక సూక్ష్మదోష మొక్కటే అంగీకరింపఁదగినది. అట్టిదోషము రసమును భంజింపదు. కావున కావ్యరసాస్వాదనకేమియు భంగమురాదు.

కాటయ వేముఁడు, హరిహరరాయల నోడించి హీరాంబికను వివాహమాడినట్లు చరిత్రయందున్న మాట సత్యమే. ఆ వివాహమునకు, సాహిత్యద్వారమున తత్పూర్వమే హీరాంబికా, కాటయ వేముల హృదయములందు జనించి, పెంపొందిన పరస్పరాభిలాష కూడ కారణముగ నీ నవలయందు కల్పింపబడినది. ఈ కల్పన, కాటయ వేముని వీరత్వమును, భంజింపకుండుటయేగాక, ఆయన సాహిత్య ప్రతిభావత్వమును, శృంగారిత్వమును వ్యక్తము చేయుచు రసపోషకముగానున్నది.

వామనభట్టు కోమటి వేమారెడ్డి యాస్థాన కవియనియు, ఆతఁడు కుమరగిరి పక్షమునుండి కోమటి వేమనకు వ్యతిరేకముగఁ దంత్రమును నడపుట, చరిత్ర విరుద్ధమని విమర్శకులన్నారు. కుమరగిరి రెడ్డి యనంతరముగదా, కోమటి వేమారెడ్డి రాజైనది. తత్పూర్వము వామనభట్టు, కుమరగిరి యాస్థానమునఁ గవిగా నుండుటకు ప్రతిబంధకమేమున్నది? శ్రీనాథుని రాజాశ్రయములన్నియు నిట్టివేగదా? కోమటి వేమారెడ్డిని గొలిచిన యా శ్రీనాథుఁడే యాతని యనంతరము వీరభద్రారెడ్డిని కొలువలేదా? అతని శత్రువైన సింగభూపాలుని పొగడలేదా?

ఈనవలలోఁ గథ లేదని, ఉన్నకథ సక్రమముగా నిర్వహింపఁబడ లేదని, వర్ణన లనుచితముగానున్నవని, సన్నివేశము లరమణీయముగా నున్నవని. విమర్శకులన్న మాటలు, ఆత్మవంచనలు, పరవంచనలు మాత్రమే.

విశ్వనాథ వేంకటేశ్వర్లు

# నన్నయ కథాకథనము

నన్నయగారు సర్వకావ్య మార్గముల సిద్ధహస్తుఁడు. ఆయన కథా కథన రీతి యొక విశిష్టమైనది.

కథ నొకానొక విధముగా మలచినచోఁ బ్రబంధ ధ్వని యుదయించును. కథను సరాసరిగఁ గట్టెఁ గొట్టెఁ దెచ్చె నని చెప్పు పద్ధతి పౌరాణికము. పురాణము సుహృత్సమ్మిత మగుటచే నందు వాచ్యార్థమే ప్రాధాన్యము నొందియుండును. కావ్యము కాంతాసమ్మితము. ఇందు వాచ్యార్థము ప్రధానము కాదు. ప్రతీయమానార్థమే ప్రధానము. నాగరకులైన జనుల హృదయ పరిపాకము సుంకు దేరఁగాఁ దేరఁగా గంభీరమైన వ్యంగ్యార్థను కతిపయశబ్ద వ్యాపారముచేతనే ప్రతీయమాన మగుచు వక్తయొక్క హృదయ నాగరకత నభివ్యక్త మొనరించుచుండును.

కావ్యమున వ్యంగ్యార్థమున కీ ప్రాధాన్య మేలయని ప్రశ్న యుదయింపవచ్చును. వ్యంగ్యము లోకధర్మము, భగవద్ధర్మము. భగవంతుఁ డీ లోక వస్తువుచేత నభివ్యంజితుఁ డగుచున్నాఁడు కాని వాచ్యార్థ ప్రకటితుఁ డగుటలేదు. లోకమునందలి ప్రత్యణువు, సర్వవాఙ్మనః క్రియా సంపుటి, భగవంతుని, భగత్తత్త్వవికాసము నభివ్యంజిత మొనర్చుచున్నవి.

వాక్కు స్వతః వ్యంగ్యార్థ ప్రాధాన్యము కలది. కొంచెము దూర మాలోచించినచో నే వాక్కునకు వాచ్యార్థ విషయమైన వస్తు వీ ప్రపంచమున లేదు. 'గోడ' యను శబ్దమునకు లోష్టసుధాసంపుటియైన 'గోడ' యను వస్తువు వాచ్యార్థము కాగలదా? కావున సర్వశబ్దములచేత సర్వ వస్తువులు ప్రతీయమానములే యగుచున్నవి గాని వాచ్యముగాఁ జెప్పఁబడుటలేదు. అట్లని యభిధాలక్షణావృత్తులు రెండును నసత్కల్పము లనుటకాదు. అస్మాచ్ఛబ్దాదయ మర్థో బోద్ధవ్య ఇతీశ్వరసంకేత శ్శక్తిః. ఈ యీశ్వర సంకేతమైన శక్తి వ్యంగ్యకోటిలోనిదే యని పరమార్థము.

కావ్యము కాంతాసమ్మితము కదా! కావ్యమునకుఁ గథ శరీరము. శరీరచేష్టాగతములైన హావభావములు శరీరాంతర్గతమైన – అనగా మనోంతర్గతమైన రసవ్యక్తి నెట్లు పట్టియిచ్చునో, యట్లే కావ్యకథాగతమైన కావ్యకథాకథనరీతి గతమైన యొయ్యారములు కావ్యాత్మయైన రసవ్యక్తి కుపష్టంభకములై యుద్దీపకములై విరాజిల్లుచుండును.

నన్నయగారు భారతేతిహాసమును గావ్యముగా దిద్ది తీర్చినవారు. ఆయన కథచెప్పునట్టి తీరుకూడ కథాత్మయైన రసవ్యంజకముగా నొకానొక యొయ్యారమును వెదజల్లుచుండును

ఆదిపర్వమునఁ బ్రథమాశ్వాసమునందే యుదంకుఁడు తక్షక ప్రముషితుఁడై కోపించి జనమేజయుపాలికిఁబోయి 'కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసంబోధన జేసి చేసె నృపపుంగవ నీవు ననేక భూసురాపాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కాకోదర సంహతిఁ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్' అని ప్రోత్సహించెను. మఱల ద్వితీయాశ్వాసమున జనమేజయ చోదితులైన మంత్రులు సర్పయాగ నిర్వహణ ప్రరోచకముగా నీ వాక్యములనే, యచ్చముగ నీ పద్యరూపముననే చెప్పుచున్నారు. ఉదంకోపదేశమువలన జనమేజయ హృదయమున సర్పసత్త్ర విషయిక బీజావాపనము చేయబడినది. దానికి

మంత్రు లిప్పుడు దోహదము చేయుచున్నారు. మిత్రు లిర్వు రేక కాలమునందుఁ గాకపోయినను నొక్కచే వాక్యమును భిన్న కాలములయం దుపదే శించినను వారి యేకవాక్యత శ్రోతను గ్రియొన్ము ఖుని గావించును గదా! ఈ రహస్యవేత్తయైన నన్నయగా రా పద్యమునే స్థలాంతరమున ననువ దించి యీ మహార్థమును సాధించిన వారైనారు.

కథాకథన చమత్కారములలో నానుపూర్విని సరిగా దిద్దుట యొకటి. భారతేతిహాసమునకుఁ బీఠికాప్రాయమైనది సర్పయాగము. దాని యనం తరమైనది కౌరవవంశ వివరణము. ఈ రెండును భారత కథకుఁ బీఠికలు. ఈ రెండును రెండు ఖండ ములుగా దిద్ది తీర్చబడినవి. నన్నయగారు సర్ప యాగఖండము నొక ప్రత్యేక మహా కావ్యముగా వ్రాసిరి. సర్పయాగమున కుదంక చరితము బీజ ప్రాయము. ఆ బీజము విస్తరించి బిందురూపము నొందింపఁజేసినది కద్రూవినతల చరితము. అందుఁ బ్రకరియై సహకారిగానున్నది సౌపర్ణోపాఖ్యానము. ఈ మహా సంవిధానమునకు నిర్వహణరూపమైనది సర్పయాగము. ఇట్లీ ఖండ మొక సమగ్ర శిల్ప రూపమునొంది భారత కథాఖ్యానమునకు నాందీ ముఖమై విరాజిల్లినది. జరత్కార్వాస్తీక చరితము లిందుఁ బతాకవలె భాసించినవి. ఉదంక కథానంత రము ప్రథమాశ్వాసాంతమున గద్రూశాప విషయిక ప్రశ్న చేయఁబడినది. దాని నంకాస్య లక్షణముగాఁ దీసికొని ద్వితీయాశ్వాసాదియందు కద్రూవినతల పుత్రప్రాప్తి యభివర్ణితమైనది. కద్రూ శాపముతోపాటుగ సౌపర్ణాఖ్యానమునందుఁ బరిణ మించి, వాసుకి విషాదము, జరత్కారు చరిత్రము, ఆస్తీకచరితము, చివరకు సర్పయాగాభివర్ణనము, తచ్ఛాంతియుఁ గ్రమముగా గొలుసు గ్రుచ్చి నట్లానుపూర్వి చెడకుండ సమర్థింపఁబడినవి. సంస్కృతభారతమున నీకథ లిట్లు లేవా యన వచ్చునుగాని యందుఁ దీర్ఘమునకుఁ దీర్ఘము, ప్రసా దమునకుఁ బ్రసాదము నన్నట్లుగా మధ్య మధ్య విషయాంతరము లనేకము లభివర్ణితములగుటచే నానుపూర్వి చెడినట్లుండును. నన్నయగారి భారత మున నీ యానుపూర్వి చెడకుండ నొక కథకు మరియొక కథకుఁ గార్యకారణ భావము నిరూ పింపఁబడియున్నది. నన్నయగా రిందనేక విషయ ములఁ బరిత్యజించి కథను సంగ్రహించి యీ యానుపూర్విని సాధించినారు. సంస్కృత భారతము నందున్న దేవతాకృత గరుడస్తుతి, కద్రూకృతేంద్ర స్తుతి, వినతోక్త బ్రాహ్మణ మాహాత్మ్యము, జరత్కార్వాస్తీక శబ్ద నిర్వచనములు - మున్నగు నవి యనేక విషయములు తెనుగు భారతమునఁ బరిత్యక్తములైనవి. కారణము నన్నయగారి కథా కథన చమత్కార నిర్వహణ దృష్టియే.

'కథం సా ద్రౌపదీకృష్ణా క్లిశ్యమానా దురాత్మభిః
శక్తా సతీ ధార్తరాష్ట్రా న్నాదహత్ క్రోధ
చక్షుషా.'

ఇది సంస్కృత భారత వచనము. తెనుఁగున లేదు. నన్నయగారు తన కథాసంవిధానదృష్టిలో నీ వాక్యమును విలాపన మొనర్చిరి. (ఇది శాఖా చంక్రమణము.) నన్నయగారి కథా నిర్మాణ దృష్టి యట్టిది.

అసలు సర్పయాగమునకు భారతేతిహాసమునకు గార్యకారణ సంబంధ మేమి? దీని కది పీఠికాప్రాయ మగుటయేమి యను ప్రశ్న వ్యాసమహర్షి నడుగ వలసినది. భారతకథ జీవకృతకర్మ సంపుట్యాభి వర్ణనము చేయునట్టిది. కర్మానుభవ మపరిహార్యము. ఆ విషయమును దెలుపుటకై సర్పయాగము పుట్టినదని, యది భారతమున కాముఖముగా వర్ణింపఁబడినదని కవిసమ్రాట్టుల వ్యాఖ్యానము.

ఈ విధముగనే కథాసంవిధానమునఁ జూపు పెట్టికొని నన్నయగారు కౌరవవంశ ఖండమును గూడ సమర్థించిరి. సంస్కృతభారతమున దుష్యంత చరితము ముందును యయాతి చరితము తరువా తను నభివర్ణితములైనవి. నన్నయగా రానుపూర్వి చెడకుండ, కావ్య సంవిధానమునుమార్చి యయాతి

చరిత్రము ముందు చెప్పి తరువాత దుష్యంత చరిత్రమును జెప్పిరి. దుష్యంతుడు పౌరవుఁడు. పూరుఁడు యయాతి సంతానము. వంశానుపూర్విని బట్టియే నన్నయగారు మార్చిరి.

మఱియొక చమత్కారము. నన్నయగారు మహా పురుషుల చరిత్రములు చెప్పుచున్నట్లే మహా పతివ్రతలకుఁ బ్రాధాన్యము నిచ్చుచుఁ గథా నిర్వహణము చేసిరనుటకుఁ బెక్కుదాహరణములఁ జూపవచ్చును. భారతమును గొంచెము శ్రద్ధా దృష్టితో బరిశీలించినచో సర్పయాగమునఁ గద్రూ వినతలు, ఆస్తీకి చరితమున జరత్కారువు, యయాతి చరిత్రమున దేవయాని, దుష్యంత చరిత్రమున శకుంతల, యారణ్య పర్వములో నల చరిత్రమున దమయంతి - వీరల చరిత్రములు ప్రాధాన్యము వహించియున్నవని గమనింపవచ్చును. ఇట్లే ప్రధాన కథయందు ద్రౌపదికి బ్రాధాన్యమీయబడినది.

సర్పయాగ కంపమునకుఁ గద్రూ శాపము ప్రథమ బీజమనుట నిర్వివాదాంశము. ఆస్తీకోత్పత్తికై వాసుకి తన చెల్లెలైన జరత్కారువును సాధనముగా నుపయోగించినాఁడు.

'వాలుపయి నడచునట్ల
బ్బాలిక నడునడ నడుంకి భయమున నియమా
భీలుఁడగు పతికిఁ బవళుల్
రేలును నేమఱక పరిచరించుచు నుండెన్,'

దేవయాని కథ జగద్విదితమైనదే. శకుంతలా దమయంతుల కథానిర్వహణములో నన్నయగారు వారిర్వుర కిచ్చిన ప్రాధాన్యము నభివర్ణించుటకు వేఱుగ వ్రాయవలసియున్నది. అది దుష్యంత చరిత్రము కాదు, అది నలకథ కాదు. అది శకుంతల చరిత్ర. అది దమయంతీ చరిత్ర. ఆ కథలలోని యాయువు పట్టులన్నియు శకుంతలా దమయంతుల మీదనే యాధారపడియున్నవి. ప్రవృత్తి నివృత్తి లక్షణమైన ధర్మద్వయమున కద్వైతము నార్జించి కృష్ణద్వైపాయను ప్రధానోద్దేశము నిర్వహించుటకై నన్నయగారీ మహా పతివ్రతల నిర్వుర నాయా కథలయందు వాహికలుగా వాడుకొనినారు. ఆ కథలయందుఁ బ్రతిపాదితమైన ధర్మాగ్నికింధనమై పోయినవారు శకుంతలా దమయంతులు. అందు ధర్మోపదేశమంతయు వారిర్వురి ద్వారానే జరిగినది. అది నన్నయగారి కథా భావనా విశేషము. భారతీయ పతివ్రతా ధర్మమున కవి పట్టుఁగొమ్మలు.

కథను జెప్పుటలో నాటకమునందువలె శ్రవ్యాశ్రవ్య భేదముండును. కద్రూ వినతల కథను జెప్పుచున్నారు :

'అమ్మహాశ్వంబు ధవళ దేహంబునందు
నల్లగలిగిన నీకిప్పునాకు దాసి
వగుము మఱియందు నల్లలేదయ్యెనేని
నీకు నే దాసి నగుదు పన్నిదము సఱము'.

అని యిట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి- ఈ పద్యము కద్రూముఖ నిర్గతమైన పన్నిదము. దానికి వినత సమాధానము చెప్పవలసి యుండెను. చెప్పినది. కాని నన్నయగారు దానిని వాచ్యముగాఁ జెప్పలేదు 'అని యిట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి' యనుటలో వినతా వాక్యములు గతార్థములైనవి. నన్నయగారి రచనలో నిట్టివి శతసహస్రాధికములు.

నన్నయగారు కథను సూటిగాఁ జెప్పఁడు. ఎక్కడ నే యంశ మెంతవఱకు వక్తవ్యమో యంత వఱకే దానిని జెప్పి, విశేషాంతరమును గాలాంతరమున వక్తవ్యాంతరముగాఁ జెప్పును. ఇది యొక మహాకావ్య నిర్వహణ లక్షణము.

మత్స్యయంత్ర భేదనము తరువాతఁ బాండవులు కృష్ణను వెంటఁబెట్టుకొని యేగి తల్లితో మే మొక్క భిక్షఁ దెచ్చితి మనిరి. ఆమె పంచి కుడువుఁడనెను. తద్విషయికమైన ధర్మసందేహ చర్చ తల్లికి గొడుకులకు జరిగినది. తరువాత బలరామకృష్ణులు వచ్చి పాండవులఁ బరామర్శించి వెళ్ళిరి. బాండవులు బ్రాహ్మణ రూపములతో నున్నారు. ద్రౌపది రాచకూతురు. ఆమె యత్తింటికిఁ బోగానే యెట్టి

మర్యాదల నడచెనన్నది పాఠకునకుఁ దెలియ వలయుఁ గదా ! కథకుఁడా విషయమును మనకుఁ జెప్పవలయును. కాని యీ కథకుఁడు గడుసరి. మనకు సూటిగాఁ జెప్పఁడు. చెల్లెలి స్థితి యెట్లున్నదో యని ధృష్టద్యుమ్నుఁడు పరోక్షముగా వచ్చి పాండవులకుఁ దెలియకుండఁ గుంభకారగృహంబున దాగియుండి వారి యితివృత్తం బెఱింగిపోయి తండ్రితో నామె వర్తనమెల్ల నివేదించెను. ద్రౌపది క్రొత్తింటి కాపురము స్థితి మన కప్పుడు తెలిసినది - అదిపర్వము సప్తమాశ్వాసము 220 మొదలు 226 వఱకు పద్యములలో నామె వర్తన మభివర్ణిత మైనది—

ఇట్లే పార్థుఁడు చేసిన కాలకేయాది సంహార మత డింద్రలోకమునఁ జేసిన పనులతోపాటు మనకుఁ జెప్పలేదు. ఇంద్రజుఁడు స్వర్గలోకమునుండి తిరిగి వచ్చి గంధమాదనంబున నున్న ధర్మజాదులఁ గూడి యిష్ట కథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుండ ధర్మజుఁడు తమ్ము డింద్రున కొనర్చిన యుపకార కథలు వినఁగోరి ప్రశ్నింపగా నింద్రపుత్రుఁడు నివాతకవచులఁ గాలకేయులఁ దాను సంహరించిన వృత్తాంతము నివేదించెను. ఈ కథను నన్నయగారీ అరణ్యపర్వ ప్రథమాశ్వాసమునందే చెప్పవలసి యుండెను. కాని చెప్పలేదు. అం దర్జును దివ్యాస్త్ర లాభము, ఊర్వశీ శాపాదికప్రయుక్తమైన, వాని మనోనిగ్రహాదులు మాత్రమే చెప్పఁబడినవి. ఆ కథ నందే చెప్పినచో నర్జును విజృంభణ వర్ణనముతో నారణ్యపర్వము ముగియవలసి వచ్చును. భారత కథకు నాయకుఁడు ధర్మరాజు. అర్జునుఁడు నాయకుఁడు కాఁడు. అతని కథాప్రస్తావన ధర్మరాజాభ్యుదయానుషంగముగాఁ జేయవలసి యుండును. నాయకుఁడైన ధర్మరా జరణ్యమున నెట్టి యిడుమలొంది, యతని ధర్మబుద్ధి యెవ్విధమునఁ బరిణతి నొందెనో యాప్రక్రమము ప్రధాన వక్తవ్యాంశము. అందుచేత భారత కథాకథనము ధర్మరాజ ప్రధానముగా నడచినది. సర్వతీర్థాటన మహాఫలశోభితుఁడై స్వర్గలోక సమీప స్థితినొంది యున్న ధర్మరాజుచేఁ గవి తమ్ముని మహాభ్యుదయ గాథాశ్రవణము చేయించినాఁడు. తమ్ముఁడు పొందిన యింద్రతుల్యమైన మహాభ్యుదయమును వినుటకు సర్వతీర్థాభిగమనక్షాళితమనస్కుఁడైన ధర్మరాజు యోగ్యుఁడు. ఆయోగ్య స్థితియందు యోగ్యమైన కాలమున నీకథ చెప్పఁబడినది. ఇది సంస్కృత భారతమునందు నిట్లే యున్నది. ఇక నన్నయగారి గొప్ప యేమన, నది తెలిసి యట్లే నిబంధించుటయే నన్నయగారి విశేషమని సమాధానము.

మఱియు నీ రీతిగనే రాజసూయాధ్వర విశేషములు పాఠకునకుఁ బ్రత్యక్షముగ వర్ణింపఁబడి యుండలేదు. మయసభా ప్రవేశమును ధర్మరాజు శుభలగ్నమునఁ జేసినాఁడు. నారదుఁడు వచ్చి సభనుగాంచి దిక్పాల సభావర్ణనము కావించి రాజసూయాధ్వర విషయికమైన ప్రోత్సాహముచేసి వెళ్ళినాఁడు. రాజసూయము జరిగినది. ఇది జరిగిన తరువాత నందు పదార్థగ్రహణ నియుక్తుడై యుండి బంధువు లందఱును బోయిన తరువాత మయసభా విశేషముల దర్శింప నింద్రప్రస్థంబునఁ గొన్నాళ్ళుండిన దుర్యోధనునకసూయ పుట్టినది. అతఁడు తిరిగి హస్తినకువచ్చి తండ్రితో మొఱపెట్టుకొనుచు రాజసూయాధ్వర విశేషములఁ బూసగ్రుచ్చినట్లు చెప్పినాఁడు. అంతవరకుఁ బాఠకుల కా యాగ విశేషములు తెలియవు. దుర్యోధనునివంటి మహాచక్రవర్తి కసూయా పాత్రమైన యా మఖవిశేష మెట్టిదో! రాజసూయాధ్వర మనగా బాఠకుల మనస్సున నుండునది ముఖ్యముగా శిశుపాలవధ. అది ప్రత్యక్షముగా వర్ణితమైనది. ఎంచుల కనగా భారతము నరనారాయణ మాహాత్మ్య వర్ణనమే ప్రధాన వక్తవ్యాంశముగా బుట్టినగ్రంథము. నారాయణుని లీలలన్నియుఁ బ్రత్యక్షముగఁ గధితములగుచుండును. తక్కిన విశేషములన్నియుఁ బరోక్షముగ నభివ్యక్తములగుచుండును. అట్టి విశేషములలో రాజసూయ

మొకటి. న్యాయముగా రాజసూయము భారత కథాప్రపంచమునం దొక ముఖ్యమైన కీలకము. అనంతర కథయంతయు దానిపై నాధారపడి యున్నది. రాజసూయము జరిగిన దేశమునఁ బండ్రెండేండ్ల మహాక్షామము గాని, సర్వ భూత వినాశకరంబగు మహాసంగ్రామము గాని రావలయును. అది యట్లే జరిగినది. అదియును గాక కౌరవ పాండవ వైరమునకు సుయోధనుని యసూయ ముఖ్యహేతువు. దానికి బీజము రాజ సూయము, మయసభ. ఆ యసూయ బీజమును గవి కొంత ప్రత్యక్షముగాఁ గొంత పరోక్షముగా వర్ణించినాఁడు. దుష్టమైన మనః ప్రవృత్తి పరోక్ష ముగనే యుండి క్రమక్రమముగా ప్రానుగట్టి జగత్ప్రళయంకరమగును. సభాపర్వమున ద్వితీ యాశ్వాసము 95 పద్యము మొదలు 121 పద్యము వఱకు నీ యసూయా వర్ణనము సేయఁ బడినది. ఇవి దుర్యోధనుఁడు తండ్రితో రహస్య ముగఁ జెప్పిన పల్కులు. వాని నట్లుగా దిద్దుట కవి ప్రతిభా ప్రమేయమునకు మచ్చుముక్కయై యున్నదనుట నిర్వివాదాంశము.

మనము సభాపర్వములోనికి వచ్చితిమి. ఈ పర్వమున నన్నయగారి కథా కథన చమత్కృతి యమోఘమై వెలసియున్నది. దీనికి ముం దొక్క మాట చెప్పవలసియున్నది. భారత ప్రధాన వర్ణ్యాంశము నరనారాయణ మాహాత్మ్యాభి వర్ణనమే యని పూర్వమే మనవిచేసితిని. ఈ విషయము సుభద్రా వివాహ ఘట్టమున, ఖాండవ వన దహనసందర్భమున, నరణ్యమున శ్రీకృష్ణుఁడు పాండవులఁ జూడ ద్వైత వనంబునకుఁ బోయిన సందర్భమున, ధర్మజ తీర్థయాత్రా మార్గమునఁ బ్రభాస తీర్థంబున, సాత్యకి బలరామ కృష్ణులు పాండవులఁ గలసికొన్న సందర్భమున మఱియు ననేక స్థలంబుల సువిస్పష్టంబుగఁ బ్రతిపాదింపఁబడి యున్నది. భారత కథా వృక్షమునకు మూలము శ్రీకృష్ణుఁడే యనుటకు మఱియొక ప్రబలతరమైన ప్రమాణము కలదు. పాండవులు ధృతరాష్ట్రు ననుమతితో ఖాండవప్రస్థమునఁ గాపుర ముండిరి. అప్పటికి ద్రౌపదీ వివాహము జరిగినది. అంతకు ముందే లక్కయింటఁ జిచ్చువెట్టుట మున్నగునవి జరిగిపోయినవి. పరమేశ్వరునకుఁ బాండవులకు బ్రత్యక్ష సంబంధము ద్రౌపదీ వివాహానంతరమే ప్రకటముగఁ బ్రారంభమైనది. రాజ సూయాధ్వర మునకు నాందీ ప్రస్తావనగా జరిగిన జరాసంధ వధమునం దది యొక విస్పష్టమైన రూపముఁ దాల్చినది. ఖాండవప్రస్థమునఁ బాండవు లుండిరని చెప్పి నన్నయగా రిట్లు వ్రాయుచున్నారు—

"హరి యింద్రుఁ దలఁచె నింద్రుఁడు
కర మనురాగమున విశ్వకర్మను బనిచెన్
సుర పురమున కెనయగు పుర
మరుదుగ నిర్మింపు ముర్వి నని కడుఁబ్రీతిన్."

విశ్వకర్మ వచ్చి యింద్ర ప్రస్థమును నిర్మించి పాండవుల కిచ్చి వెళ్ళినాడు-నాటినుండి శ్రీకృష్ణుఁడు పాండవుల యోగక్షేమములకుఁ బ్రత్యక్ష బాధ్యత వహించి మెలంగుచుండి న[illegible] విదితమగుచున్నది. అది జరాసంధ వధమున మఱి[illegible]ఁ బ్రకటితమైనది. శిశుపాల వధముతో జగత్ప్రసిద్ధమైపోయినది.

పరమేశ్వర చైతన్యము జాగరితమై యుండగా జీవు డనిష్ట కార్యాచరణ మొనర్చుట సాధ్యము కాదు. 'యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సానిశాపశ్యతోమునేః' అని గీతోక్తి. ప్రపంచ జీవు లజ్ఞాన నిద్రయందుండగా, సంయమి (పర మేశ్వరుఁడు) మేల్కనియుండును. ప్రపంచ జాగ్ర దవస్థ ద్రష్టయైన మునిభావనమున నిద్రావస్థయే. శ్రీకృష్ణ సన్నిధియందుఁ బాండవుల కపకృతి సేయుటకు శివుఁడైనను జాలఁడు. ఈ విషయము నరణ్యపర్వమున శ్రీకృష్ణుఁడు వక్కాణించి యున్నాడు.

'అనిఁ గర్ణ శకుని దుర్యో
ధనదుశ్శాసన నవాస్త్ర ధారాపాతం

బునఁ దృప్తిఁబొందు వసుధాం
గనరాక్షస కాకగృధ్రగణములతోడన్.'
'అవినీతుల వధ్యులఁ గా
రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
ప్రవరున కొనరింతమ యీ
యవనీ రాజ్యాభిషేక మవిజిత శక్తిన్.'

'అని యుగాంత్యకాల కుపిత కృతాంతాకృతి నున్న జగన్నాథు జనార్దనుం బ్రశాంత చిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె.'
ఇది శ్రీకృష్ణుని పరిస్థితి. తత్త్వమేమనగాఁ జైతన్య జాగ్రదవస్థయందు జీవున కనిష్ట కర్మాచరణము సంభవింపదు. అది మాయావరణముచేఁ బిహితమై యున్నపుడే లోకదుర్వృత్తి సాగును. భారతమున నట్లే జరిగినది. దుర్ద్యూతకాలమున శ్రీకృష్ణుఁడు లేడు. ఆయన యున్నచో ద్యూతము సంభవించి యుండదు. "మీకెగ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్.' ఇవి శ్రీకృష్ణ వచనములు.

నన్నయగారీ ఘట్టము నీ యంశమునఁగను కలిగియే దిద్దితీర్చినట్లు స్పష్టప్రతిపత్తికముగాఁ గనవ్పట్టుచున్నది. చిత్తగింపుఁడు. ద్యూత వృత్తాంతము సభాపర్వమున ద్వితీయాశ్వాసమున నభివర్ణితము. అందు మొత్తము 320 పద్యములు మాత్రమే కలవు. వానిలో నూటయేఁబది పద్యములు శిశుపాలవధయందు గతార్థములై పోయినవి. ఇక మిగిలినవి 170 పద్యములు. వానియం దేబది యాఱు వచనములే. సీసాదులైన పెద్ద పద్యము లాఘట్టమున ౩౫ మాత్రమే యున్నవి. ఈ లెక్కయంతయు వ్రాయుట యెందుకనగా, శ్రీకృష్ణుని యసన్నిధిలో జరుగుచున్న, జరుగవలసిన యీ యనిష్టకర్మాచరణము నెంతత్వరలో ముగించిన నంత మంచిదని నన్నయగారు తొందరపడి వ్రాసి నట్లున్నది. ఈ 170 పద్యములలో బ్రథమ ద్యూతము, ధర్మరాజు నోటమి, ద్రౌపదీపరాభవము, ధృతరాష్ట్రవరప్రదానము, పాండవులకు బునారాజ్యలాభము, ద్వితీయద్యూతము, పునఃపరాజయము, వనవాసగమనము, పాండవుల ప్రతిజ్ఞాదికములు మున్నగు బహుళాంశములు చకచక సాగి పోయినవి. సిద్ధహస్తుఁడైన చిత్ర నిర్మాత కథా పరిణామదశా పరాకాష్ఠయందుఁ గథ నతివేగముగ జిత్రించుకొని పోయినట్లే కథా భాగమును నన్నయగారు మహావేగమున నడిపించుకొని పోయిరి. ఇందున్న తొమ్మిది యంశముల యభివర్ణనము నిజముగాఁ దలచుకొన్నచో నన్నయగారు తొమ్మిది వందల పద్యములలో నిర్వర్తించియుందురు. కాని యా దేశ కాలము లట్టివికావు. పరమేశ్వరుఁడు లేడు. కర్మ తలుముకొని వచ్చుచున్నది. ధర్మరాజు తెలివితక్కువ వాఁడా? నేను ద్యూత మాడనని శరింపలేఁడా? తన్ను ధృతరాష్ట్రుఁ డాజ్ఞాపించునా? తాను దలచుకున్నచో భీష్మాదు లాగుదురా? పిలువు దూరముననున్న శ్రీ కృష్ణదేవునకుఁ గబురంపరాదా? కాదు. కర్మ బలీయమైయున్నది. పితృ వచనమునకుఁ గట్టువడినాడు. పితృతుల్యుఁడైన విదురు నిదేశమునకు లొంగినాఁడు. పైగా ద్యూతము సర్వగుణ నాశనియని తా నెఱుఁగును, ఆ యావేశము పుట్టినది. రాజ్య ధన ధాన్యాదులనే గాక, తమ్ములను, భార్యను గూడ నొడ్డినాడు. ఇంత మహా కథయు 170 పద్యములలో నొదిగి పోయినది. ఏదో కొంత మనస్సు పొంగిన ప్రతిజ్ఞాదికములైన పలుకులను వ్యక్తీకరించుటకు మాత్రమే నన్నయగారా ౩౫ పెద్ద పద్యములను వాడినాడు. కథా వేగము సూచించుటకు 56 వచనములేయున్నవి. తక్కినవన్నియు గీతములు, ఆట వెలదులు, కందములు. అనిష్టము హఠాత్సంభవము. భగవంతుని యసన్నిధిలో నది జరుగవలయును, అర్జునుని ధనుశ్శక్తివంటి నన్నయగారి కవితాశక్తి యాసందర్భమునఁ గావలయునని బుద్ధి పూర్వకముగఁ గుంటువడినది. అది నన్నయ ఋషిత్వము. దేశ కాలానుసారియైన ఛందః ప్రయోగ వైచిత్రి, దేశ కాలానుసారియైన కథా సంగ్రహాణ నిగ్రహదశా విశేషము లిందుఁ బ్రకటితములై నన్నయగారి మహాకవిత్వ రచనా సార్వభౌమత్వమును సర్వథా స్థిరీకరించుచున్నవి.

# పుచ్చా పూర్ణానందం | వంటలక్క గిరాకీ

మా వేలువిడిచిన మేనమామ కొడుకు కులదీపక రాయ్ ప్లీడరీ బల్లకట్టాడు. కోటయ్యో, వెంకయ్యో అని తెనుగుపేరుపెట్టక బెంగాలీ యెందుకని మేము వరసకు వేళాకోళంచేస్తే మా ముక్కోపి గోవిందం మామయ్య చిందులు శివాలు త్రొక్కుతూ 'మీరంతా బెంగాలిక్రాపు, బెంగాలీలాల్చీ, బెంగాలీ సాహిత్యానికి అనువాదాలు- పల్లకీలు మోయటం మీరుట్రా, నన్ను హేళనచేయటం, కాకుంటే కాస్త నామకరణం అనుకరణ చేశాను' అని మమ్మల్ని రక్కివొక్కొక్కప్పుడు వో పడవతిట్లుకూడా వడ్డించేవాడు.

మా అత్తయ్య రాయ్ చిన్నతనంలోనే పోయింది. అంచేత వంటలక్క అవసరం ఏర్పడ్డది. మా రాయ్‌కి చిన్నప్పటినుంచి చదువుకున్న భామను పెండ్లాడాలని మాలావు మోజు. అయితే అట్టే చదవకూడదు. గ్రాడ్యుయేట్ల ఆఫర్ వచ్చేసరికి యితని గుండెల్లో బ్యాండుమేళం వినిపించింది. కనుక మధ్యస్తంగా వొక మెట్రిక్‌కు కూర్చుంటున్న పిల్లను యేరుకొన్నాడు. ఆమెకూడా గజినీ దండయాత్రలు చేసిందే కాని మెట్టుకి నెట్టలేదు. రోగీ పాలే కోరాడు వైద్యుడూ పాలే చెప్పాడు, అన్నట్టు కాలేజీ కోర్సుతో నిమిత్తం లేకుండా ఫామిలీ కోర్సులో పడ్డది. చదువు అంటలేదు కాని స్టైల్, స్టాటస్ ముదిరినై. పైగా నాజూకు హెచ్చి ఆరోగ్యం తగ్గింది. ఏటేటా కాన్పులు. అర్ధాంగి అసలే అబ్బనాకారి కావటం, అందులో వెంటవెంటగర్భిణి యేర్పడ్డం మూలకంగా రాయ్ యింట వంటలక్క వుండటం తప్పనిసరి అయింది. కాని, మా రాయికి వంటలక్క అతికేగతిలేదు. కొందరు గొప్పోళ్ళకు పెళ్ళాలు అచ్చిరారు. మృతహస్తంతో మెడలో మంగళసూత్రంబొందు మూడుముళ్ళు వేసేసరికి మూడు ప్రాణాలు దెబ్బతిని పెండ్లిపందిరి విప్పకపూర్వమే, పదహారురోజులపండుగ జరక్కమునుపే మిగతా రెండు ప్రాణాలు పూర్తిగాపోయి పెండ్లి కూతురు గల్లంతై, ఆ తర్వాత యెందర్ని పెండ్లాడినా పుటుకు పుటుకున పోయి యావజ్జన్మ భార్య కొరత అనుభవించే అభాగ్యులు కొందరు. మొత్తం మీద యేమి గ్రహచారమోగాని స్థిరమైన వంటలక్క దక్కలేదు.

మొదట్లో వో పిల్లల తల్లి వుండేది. ఆ పిల్లలకు తండ్రి కరువైనందున గతిలేక నానా అగచాట్లు పడుతూ ఆమె వీరింట్లో వంటకు కుదిరింది. మారాయ్ తన పెద్ద పిల్లవాడితో పాటు ఆమె పిల్లలకి కూడా వొక యేడాది పాటు స్కూలు జీతం కట్టాడు. సెలవులైన తర్వాత రాయ్ కొడుకును చదివిన క్లాసునే తిరిగి చదవమన్నారు. ఆమె కొడుకులు పై క్లాసుల్లోకి పోవటమే కాక ఫస్టుగా పాసైనందుకు బహుమతులక్రింద పుస్తకాలు వచ్చినై. ఈ వార్త వినగానే రాయ్ పెళ్ళాం ఆ వంటలక్కను వుద్యోగం బర్తరఫ్ చేసేసింది.

ఆ తర్వాత వో వికాసిని ప్రవేశించింది. పాపం యే పదార్థంచేసినా శ్రాద్ధయోగ్యంగా తయారయ్యేది. పూర్తిగా వుడకటం, వేగటంలో ఆమెకు అట్టే విశ్వాసం లేదు. అథవా పొరపాటున ఆమెకు తెలియకుండా పాకానబడితే వెంట్రుక తుక్కలు కావాలని వేస్తుందని ఆమెపై అనుమానం యీ కుటుంబంవారికి. ఒక రోజున వంకాయకూర కూడా చాకచక్యంగా చెడగొట్ట

కలిగింది. అయినా యెందుకైనా మంచిదని వెంట్రుక తుక్కులు కూడా విరివిగా వేసినట్టుంది. మా గోవిందం మామయ్యకు వొళ్ళుమండి పైకి శాంతం నటించి, 'మా బాగా చేశావు. జిహ్వ లేచి వచ్చింది, యింకా వడ్డించు, యింకాస్త వడ్డించు, పళ్ళెం మొత్తం పట్టుకురా' అని ఆమెను తీసుకు రానిచ్చి, పళ్ళెంలో కూర మొత్తం యెంగిలిచేత్తో తీసి వొంగున్న ఆమె నెత్తిపై రుద్ది, 'నీ మొగుడు నీ చేతి కూడు తినలేక చచ్చాడు, తెలిసిందా?' అన్నాడు. 'నీ పెళ్ళాం నీ అఘాయిత్యం పడలేక నే పెంద్రాడే కాలంచేసింది' అని ఆమె తిట్టి కొన్ని ఘాటైన శాపనార్థాలు పెట్టి ఉద్యోగం చాలించుకు పోయింది.

మరో వంటలక్క తన యింటిదగ్గరే మడి కట్టుకొని వచ్చి సరాసరి వంటలోకి దిగేది. కాని, పదే పదే దొడ్డిగుమ్మంవద్దకు వెళ్ళివస్తూవుండేది. వారానికి సరిపోయే సరుకులు నాలుగు రోజులు రావటం ప్రారంభించినై. ఒరోజు రాయ్ భార్య మెల్లగా వెనకాలే వెళ్ళి, గోడమీదుగా ఆమె కుర్రాళ్ళకేవో అందిస్తున్నట్లు కనిపెట్టింది. తెలీనట్లుగా వుండి వొక రోజున నగ్నపరీక్ష చేసింది. ఆమెకు మొలత్రాడు, దానికి సంచులు, సీసాలు వ్రేలాడ కట్టివున్నవి. తక్షణం డిస్మిస్ చేసింది.

రాయ్ అపాయింటుచేయటం, మామగారో కోడలో డిస్మిస్ చేయటం. వెంట వెంటనే చాలా మందికి వుద్వాసన వచ్చింది. ఎవర్ని తెచ్చినా వారలకు స్వస్తి చెబుతుంటే రాయ్ నిరుత్సాహ పడ్డాడు. కాని కుక్‌ను పెట్టక తప్పదు. ఇదివరకు అరు కాన్పులు ఆస్పత్రిలో జరిగినా యేడవది యింట్లోనే జరగాలని గృహలక్ష్మి పట్టు పట్టింది. పేపరులో వేయలేదన్న మాటేగాని పది మందికి చెప్పివుంచాడు వంటలక్క కావాలని.

నేను మా వూరినుంచి చుట్టంచూపుగా వెళ్లా; వుత్తచేతుల్తో కాదులే, బూడిదగుమ్మడి కాయ, బుడందోస వరుగులు తీసుకు వెళ్లా. మొదట్లోమంచి ఇంప్రెషన్ పొందితే నాలుగు పూటలు నిల్వ వుండొచ్చుగా! ఆఫీసులో రాయ్, గుమాస్తా యిద్దరే, నన్నుకూడా ఆ గదిలోనే అట్టిపెట్టాడు కదలనీయకుండా. యెవరైనా వస్తే నేనొకడ్ని పార్టీ పొజిషన్‌లో అగుపడతాగా! కాటకం వచ్చి పార్టీలు కరువైరిగా! యాగం చందా, పురాణం చందా, వారాలు, టోర్నమెంట్సు - అంతా యీ బాపతు జనమాత్రం వచ్చారు. కోర్టులో వొత్తిడి పనులేమీ లేవుకాబోలు, రాయ్ తాపీగా నాతో కబుర్లుచెబుతూ కూర్చున్నాడు. ఇంతలో వొక వితంతువు ఇంటర్వ్యూకి వచ్చింది. మనోవర్తివ్యాజ్యం వొకటి లభించింది అనుకున్నాడు మొదట్లో. తీరా విచారిస్తే, కుక్కు జాబ్‌కోసం. మంచి వుపన్యాస ధోరణిలో కండిషన్సు అన్నీ కామా ఫుల్‌స్టాప్ లేకుండా దంచేసింది.

తను చాలా గౌరవకుటుంబానికి చెందిన మనిషి నని, తన పరిస్థితి నేటికిలా పరిణమించిందని, తన తాతగారు తూములున్నచోట్లల్లా భూములు సంపాదించినాడని, తన తండ్రి హయాంలో నిత్య సంతర్పణలవల్ల తమ ఆస్తంతా నేతి ఝూరీచెంబు కొమ్ములోంచి పోయిందని, తనకు పెండ్లిఅయిన తరువాతనే పెనిమిటి పోయాడని, తన తమ్ముడి పెండ్లి యీమధ్య జరగవలసిందే కాని పెండ్లికూతురు ప్రసవించటంతో ఆగిపోయిందనీ, తనకు ప్రథమభర్త పోవటంలో తాడు తెగిందని, రెండో పెండ్లి కాగితం తగులడ్డదని (రిజిష్టరు మారేజి గనుక), మొదటి మగడు నరకంలో వున్నాడని, రెండోఆయన స్వర్గం చేరాడని, లేటుపెనిమిట్లు కేశసంపదనెంతో కొనియాడుతూ వుండేవారని, వారిమీద వున్న గౌరవంచే తను శిరోముండనం చేయించలేదని, అదిన్నిగాక, రోజులు కలిసివస్తే తనకు మళ్ళీ పెళ్ళి అయ్యే అవకాశం లేకపోలేదని, తన శకునం మంచిదని, తను యెదురొస్తే పనులన్నీ సక్రమంగా నెరవేరుతవని, ఆ సంగతి 'శకునపక్షి' సినిమాతీసిన ఫిలింకంపెనీ ప్రొడ్యూసరు—డైరెక్టరు బుంగ

బద్దయ్యగారుకూడా శతదినోత్సవ సందర్భంలో బహిరంగసభలో బాహాటంగా చెప్పియున్నాడని, తను నాన్ ముత్తయిదైనా చాలామంది ముత్తయిదువులకన్న శ్రేష్ఠమని, వారలలో చాలామందికి లేని జీవకళ తనలో వుందని, తను మాజీముత్తయిదు కనుక తనలో పూర్వపు సువాసన చాలా మిగిలిపోయిందని సకేశినిగా వుంటానికి బలమైన కారణాలు బోలెడున్నాయని చెప్పింది.

తను బేషరతుగా ప్రవేశించుటకు వీలులేదు. షరతులన్నీ కట్టుదిట్టంగా వుండాలి; తు. చ. తప్పకుండా అమలు జరగాలి. అందులోనూ తను అఖిలాంధ్రకుక్సుసమ్మేళనపూర్వసువాసినీ శాఖకు గౌరవ కార్యదర్శినని చెప్పింది. అమాయకపు వంటలక్కల కాయకష్టాన్ని తరతరాలనుంచి కొల్లకొట్టుకుంటున్న గృహస్థుబూర్జువాల నిరంకుశత్వం నశించాలంది. తనకు కాఫీ మాచెడ్డ అలవాటని, తన మొదటి మగడు రాత్రిపూట పోతే తెల్లారుజామున కాఫీ పెట్టుకొని వేడివేడి స్ట్రాంగు డికాషను గొంతులో పడ్డాకనే గొంతెత్తి బిగ్గరగా యేడ్వగలిగానని చెప్పింది. కాఫీ వేస్టుఅనో, కాస్ట్లీ అనో, రోగకారణమనో యేదో నెపంబెట్టి యింటివారు కాఫీ మానినా తనకు కాఫీ కంపల్సరీ అని, ఫ్లాస్కులతో కాఫీనింపి రెడీగా వుండితీరాలని చెప్పింది.

సనాతన అధునాతన పద్ధతులు రెండూ మేలు కలయిక కూర్చి, నవ్యరుచులతో చేయగల ప్రజ్ఞ ప్రజాపతి తనకు ప్రత్యేకంగా యిచ్చాడన్నది. కాని తినేవాళ్ళ దురదృష్టంవల్ల వాళ్ళనోట శనివుండి ఒక్కొక్కప్పుడు పాకం చెడవచ్చు. ఇదేం పబ్లిక్ పరీక్షా ప్యాసై తీరాలి అని పట్టుపట్టటానికి! కుక్ చేసినవంట కిక్కురుమనకుండా పేర్లు పెట్టకుండా తినాల్సిందే. చేసుకున్న పెళ్ళామా, నస, సణుగుడు పడ్డానిక్కి? అయినా చాలామంది పూర్వసువాసినులు పునర్వివాహం చేసుకోటంవల్ల, చదువులు వుద్యోగాలువల్ల, హిందూలా సవరణవల్ల, వోటింగు హక్కు వచ్చినందువలన, స్వాతంత్ర్యం, స్వరాష్ట్రం సిద్ధించడంవల్ల కుక్సుసంఖ్య నానాటికీ క్షీణించే ప్రమాదం గలదని చెప్పింది.

బ్రహ్మ కొందరి జాతకం పార్కరు పెన్నుతో వ్రాశాడని, తన జాతకం గద్దఈకతో గీకినాడని, అనతికాలంలో స్పుత్నిక్ వీక్షణవల్ల తన జీవితం మారగలదని, లగ్నాధిపతి రాకెట్ రాశిలో జొరబడ్డాడని, కొద్దికాలంలో లోకులు కుక్సుకు జేజేలు కొట్టూ పల్లకీ మోస్తారనీ సెలవిచ్చింది.

తనది కడు సున్నితమైన ప్రాణి అని, కండ్లకు పొగ తగలకుండా వంటింటి చిమ్నీలు, పెద్ద కిటికీలు వుండాలని, కట్టెలతో చేయడం కష్టం గనుక బస్తాలకొద్దీ బొగ్గే కొని వుంచాలని, అరడజను కుంపట్లు వుండాలని, గిన్నెలు పెట్టడానికి దించడానికి పట్కార్లు, పొయ్యి వూదడానికి గొట్టాలు సప్లయిచేయాలని, తనకళ్ళు ఆప్టీషియన్‌చేత పరీక్ష చేయించి తగు సులోచనాలు వుచితంగా యిప్పించాలని చెప్పింది. అలా చేయనిచో విస్తళ్ళలోకి వచ్చే రాళ్ళు, 'చింతపుల్లలు వగైరాలకు తను బాధ్యతవహించలేనని నిర్మొగమాటంగాచెప్పేసింది. ఇంట్లో మగడు పెండ్లాం కీచులాడుకోవటం, పిల్లల అరుపులు గలభా వుండకూడదు. మాజీ మొగుళ్ళు దయ్యాలై తనమీద మోజు చావక వెన్నంటి వున్నారని, ఏమాత్రం రద్ది జరిగినా తనకు హిస్టీరియా ఫిట్సు వస్తవని వార్నింగు యిచ్చింది. తనకు వేళకు భోజనం పడకపోతే భూగోళమంతా గందరగోళంగా వుంటుందని, పురుషులు సైరన్ కూసేసరికి యింటికి రాకపోతే తనముందు తినేసి వెళ్ళిపోవటమే, తర్వాత వాళ్ళొచ్చి పెట్టుకు తినాల్సిందే అని కఠినంగా శాసించింది. కొందరివి పాపిష్టి దిష్టికళ్ళు గనుక తనకు మొదటినుంచీ వొంటరిగా కూర్చుని తినే అలవాటంది.

ఆ దెబ్బతో నా గుండె ఝల్లుమన్నది బెల్లం కొట్టిన రాయిలాగా నోరెత్తక, శ్రోత పార్టే ప్లే చేస్తున్నాడు. అతని పెండ్లాం చురచుర చూస్తూ

గవాక్షంలోపల ప్రక్కగా నిలబడి వింటున్నది. కోర్టు సైలెం అయిందని గుమాస్తా జారుకున్నాడు.

నాన్‌స్టాప్ గర్భిణీలకు మగాళ్ళను శిక్షించాలని, అసలు భర్త కంట్రోలులోవుంటే బర్తు కంట్రోలుతో పనిలేదని, భర్తమీద నాట్యమే భరతనాట్యం పుట్టుక అని చాలా కొత్తసంగతులు తెలియజేసింది.

తనకు పదార్థ గుణగ్రహణపారీణత, రుచి పాకములు, వంట పస, పుట్టుకతోనే సంప్రాప్తించిన విశేషమని బయటపెట్టింది. తనచేతి కూడు తింటే అజీర్ణరోగభయం వుండదని చెప్పింది. పిల్లలకు వడలు పెట్టి ఒడలు పెంచితే బడుద్ధాయి వెధవలై లడాయిలకు దిగి యాగీలు తెస్తారు. కనుక బడాయి మాని పిండివంటలు యే పండక్కో చేసుకోవాలని సలహా.

తను చేయటానికి బద్ధకించి చెబుతున్నానని అపోహపడవద్దంది. తను తైలం రాసీరాయకుండా వేడివేడి పెనంమీద పిండి వేస్తే వీపు కాలి కెవ్వుమని కేకవేసి అట్టు యెగిరి దూకి విస్తళ్లలోకి పడుతుందని తన ప్రజ్ఞ తెలియజేసింది! తను కుక్సుకు ట్రైనింగ్ కాలేజీ పెట్టి వంట కోర్సుకు తర్ఫీదు యిచ్చి, డిప్లొమోలు యిప్పించాలని ఆలోచన కలదని చెప్పింది. గవర్నమెంటు తను పెట్టబోయే ఆ సంస్థకు రికగ్నిషన్ యిచ్చి, అక్కడ డిప్లొమోలు పొందినవారికే కుక్కు లైసెన్సు యివ్వాలంది. అవకాశముంటే వచ్చే యెలక్షనులో ఈ ప్రణాళిక మీద నిలబడి కాబినెట్‌లో మంత్రిణిగా దూరి తిండి వ్యవహారాలు పరిపాలించాలనే కుతూహలం కలదని, కొద్ది కాలంలో రాజధాని నగరమైన హైద్రాబాదులోనూ, తెనుగు గడ్డకు నడిబొడ్డుగా విరాజిల్లుచున్న విజయవాడలోనూ వంటలక్కల కళాపరిషత్సభలు జరిపి, పాక కళకు ప్రచారం, ప్రోత్సాహం చేకూర్చాలని, తన చిరకాలవాంఛ అని చెప్పింది. ఈ సందర్భంలో వంట పోటీలు, బహుమానాలు, సన్మానాలు ఏర్పాటు చేయాలి. కవులు పిండివంటలపై గేయాలు వ్రాయాలి. అవి సర్కారు ఖర్చుతో అచ్చువేయించాలి. స్కూళ్లలో ఆ పుస్తకాలు పాఠ్యగ్రంథాలుగా పెట్టాలి. వంట సాహిత్యం విస్తరించాలి. బుర్రకథలు చెప్పాలి.

పెళ్లాంకాస్టీ, కుక్కు చవక అనుకునే రోజులు మారినై. వంటలక్కలు కళ్లుతెరిచారు. బేసిక్ పే, అలవెన్సులు అన్నీ వందలలో వుండాలిసిందే. ఈ మూగ శ్రమజీవులు కొద్ది వేతనాలకు యిహ మోసపోరు. సంఘాలు లేవదీసి అలజడిచేస్తారు. తమ న్యాయమైన కోర్కెలకొరకు, జన్మ హక్కుల కొరకు పోరాటం జరుపుతారు - గరిటెలతో, అట్లకాడలతో, చేతి కొరువులతో వీరిని అడ్డగించగల శక్తిలేదు. అట్టి విశ్వకల్యాణంకొరకే తను కంకణం కట్టుకొని, మూడో పెళ్లి ప్రస్తుతం వాయిదా వేశానన్నది.

అకాలమైంది. ఆవదు. నాకు పరాయి యింటికి వస్తే మరీ శోష. మళ్లా మొదట్లోకి వచ్చింది ఆపె ధోరణి.

తను రైల్వే మడితోనే వంట చేస్తానని, మడి ఆచారంలో తన కేమాత్రం విశ్వాసంలేదని, చన్నీళ్ల స్నానంచేస్తే జలుబు చేయగలదని, వేడినీళ్ళు కంఠ స్నానం చేయగలనని, కావలిస్తే పట్టుబట్టకొని యివ్వమని, తడిగుడ్డ తనకు సుతరామూ గిట్టదని చెప్పింది. వింత కాంబినేషన్సు చేయగలనని, పకోడీ బజ్జీ వేర్వేరుగా కాకుండా 'బజోడీ'లు చేయగలనని, చక్రపొంగలి. కేసరీ భాత్ కాకుండా కేసరిపొంగలి, చక్రభాత్ తయారు చేస్తానని తెలియజేసింది. కూరకు, పచ్చడికి, పులుసుకి ఒకేశాకం చేసే అలవాటని చెప్పింది. అంతా తనది నూతన పంథా అని చెప్పింది. రుచి తినేవాళ్ళదంతసిరి, నోటికని మీద ఆధారపడి వుంటుంది. తనది నిష్కామకర్మ, సాక్షీభూతంగా కుంపటికేసి చూస్తూ కూర్చుంటానన్నది. చేయికాలితే ఫస్ట్‌ఎయిడ్‌కు నవనీతం, వాస్లైను రెడీగా వుంచాలి. ముక్కలు తరిగేటప్పుడు దోస, బీర చేదువుందో లేదో, ఆ పరీక్ష యింటి వాళ్ళకేగాని తనకేమి నిమిత్తంలేదు. అడపాతడపా

పురుగులు వస్తవి, అందుకని సణగకూడదు, బ్రాహ్మణులు ఈ రూపకంగానైనా మాంసాహారం చేస్తే బలంచేకూరుతుందని సగర్వంగా సెలవిచ్చింది. ఇంటికి రోజూ రానూపోనూ రిక్షాలకు, సిటీ బస్సులకు ఛార్జీలు యిచ్చుకోవాలి. ఏకొత్త పిక్చరు వచ్చినా మొదటిరోజునే వెళ్ళే అలవాటు. ఆ రోజు తనకు ఘనంగా యివ్వాలి. వారంవారం తలంటి తనకుండాలి. ఇంటావిడ ప్రతి శుక్రవారం పోసుకోటానికి బద్ధకించవచ్చు. లేదా లోభించవచ్చు. తనది గాజుకాయ శరీరం. తనుమాత్రం ఆజ్యం గిన్నెతో బోర్లించుకోటమే గాని, మిల్లెలతో కాదు.

తనకువచ్చే కవర్లు చింపకూడదు. పూర్వపరిచితులు అనేక పనులమీద రావటం కద్దు. వాళ్ళను అడ్డగించకూడదు. అనుమానించకూడదు. తన గౌరవానికి సురిగింజ యెత్తైనా భిన్నం జరగకూడదు. తను లోగడ వుండివచ్చిన యింటి ఆయన బయట పులి, యింట్లో పిల్లిఅని, ఆయన యింటికి రాగానే సూటు విప్పి పెళ్ళాన్ని వీపురుద్దేవాడని, తనమీద ధాం ధూంలు చేస్తే ఒళ్ళుమండి, వోరోజున నేతితో నిప్పురాజేసి, పులుసుతో ఆర్పి, కాఫీతో కాళ్ళుకడుక్కుని, పాలు పుక్కిలించి పుమ్మేశానన్నది.

ఇంతలో మా గోవిందం మామవచ్చి గ్రుడ్లు పురుముతూ చూచాడు. తర్వాత కబురుచేస్తాలే అని మా రాయ్ అన్నాడు. 'ఏమీ అక్కరలేదు. వెంకమ్మగారు వాళ్ళ దొడ్డమ్మను యేర్పాటు చేస్తానన్నది' అని హోమ్ గవర్నమెంటు ఆర్డినెన్సు జారీ చేసింది. ఇంతకూ నాకు కొంతకాలం వాళ్ళింట్లో ప్రసాదం తినే గీత వుంది!

# నైవేద్యము | ఉత్పల సత్యనారాయణాచార్య

అంచిత భక్తితోడ జను
　　లందఱుఁ బువ్వులు పండ్లనున్ సమ
ర్పించుచునుండ నే నొకటి
　　రెండు ఫలంబుల నారగింపు సే
యించక చెంతనుండి భజి
　　యించెడు నప్పుడు స్వామి చూపు నా
పంచియలోని పండ్ల పయిఁ
　　బడ్డది— చప్పున మాఁటువెట్టితిన్.

తేకువతోడ నేఁడు గొని
　　తెచ్చిన పండ్లివి నీ కొసంగి నా
రాకకు వేచి వాకిట ని
　　లంబడి చూచుచు "ఏవి పండ్లు నా
న్నా! కొనిరావు నీ వెపుడు
　　నా" కను బిడ్డల కేను నిర్దయా
భీకరమూర్తి వోలెఁ గని
　　పించగలేను ప్రభూ! నిమేషమున్.

ఎవరొ స్వామికిఁ బూజ చేయించుచుండ
వెస గుబాళించె నా మూట వెలయు పండ్లు;
పండ్లవాసన లెట్టు లాపంగవచ్చు?
స్వామి కనుదమ్ము లెట్లు కప్పంగవచ్చు?

అంత నర్చకుండు యవనిక దిగజార్చి
స్వామి కారగింపు సలుపుచుండ
నన్నుఁ బరిహసించె నా జిల్గు వలిపంపు
పంచెలోని పండ్లు ప్రతిఫలించి.

గుడి గంటల్ వినిపింప నీ కడకు
　　రాకుండంగఁ బోలేను నా
కడ నున్నట్టివి నీ కొసంగక
　　చనంగా లేను— ఏదేని నీ
కిడుచున్నప్పుడు నాదు బీదతనమో
　　ఏదో ననున్ లుబ్ధునిం
గడు దుర్బుద్ధినిఁ జేసి కొంత తడ
　　వాకట్టుం గదే! చేతులన్.

ఆదరమొప్ప నీ కొసఁగు
　　నట్టి ఫలంబది శూన్యమందునన్
గాదని నీకు నర్పణ
　　మొనర్చిన దించుకయేని వ్యర్థమై
పోదని దానినిం దిరుగఁ
　　బొందెదనంచని నమ్మియుండియున్
లేదనకుండ నీ కొసఁగ
　　లేను గదా! దురదృష్టవంతుఁడన్.

అకృతాత్ముల్ సుకృతాత్ములో తెలియ
　　రా కజ్ఞాతమైయున్న యా
స్తిక లోకమ్మున కీ వొసంగెడు
　　శుభాశీర్వాద వారమ్ములో
నొక లేశంబును మాకుఁ జెందునటులన్
　　యోజించి మా వంటి లు
బ్ధకులం గూడ సముద్ధరింపుము ప్రభూ!
　　దాక్షిణ్యభావమ్మునన్.

పద్యమందుఁ దగిన పదము వేయకయున్నఁ
గవికిఁ గలుగునట్టి కష్టమెంతొ
దైవమునకు నీయఁ దగినది యీకున్న
భక్తుఁ డొందునట్టి బాధ యంత.

# అభ్యుదయ నాటికలు

దొప్పలపూడి శ్రీనివాసరావు

తెలుగు నాటకరంగము యొక్క చరిత్ర ప్రారంభమై వందసంవత్సరములు దాటలేదు. ఈ కాలముననే వేలకొలది నాటకములు ప్రచురింపబడి ప్రదర్శింపబడినవి. ఈ నాటకములు భిన్నభిన్నములైన మార్గములలో రచింపబడి స్వపరదేశీయములైన అనేక సాహిత్యప్రభావములచేత వికాసము పొందినవి. ఈ వికాసమంతయు అభ్యుదయ మనవచ్చును.

అభ్యుదయనాటిక లనగా నేమి? ఈ అభ్యుదయ శబ్దము మన సాహిత్యములోని అభ్యుదయ కవిత్వము మొదలైనచోట్ల ప్రయోగింపబడినట్టిదా? లేక రూపకముల యందలి నవ్యత్వము పొందినదా? క్రొత్తదనమన్నది ఏ సాహిత్యము నందైనను కాలము మారినకొలది కలుగుచునే యుండును. ఈ క్రొత్తదనమే అభ్యుదయమైనచో ఇప్పుడు మనము అనుకొన్న అభ్యుదయ సాహిత్యము పాతబడి వేరొక సాహిత్యము అభ్యుదయ ముద్రను తగిలించుకొనవచ్చును. ఈ అనిశ్చితమైన స్థితిని నిర్ణయించువారెవరు? కొందరు మార్క్సు ప్రతిపాదించిన సామ్యవాదమును ప్రచారముచేయు సాహిత్యమే అభ్యుదయమనిరి.

ఈ అభ్యుదయభావమును నిర్వచించునపుడు కేవలము దాని వస్తుత్వమును గూర్చి విచారమేకాని వస్తుస్వరూపమును గూర్చిన విచారణ చేయబడుటలేదు. ఈ కళావస్తు సంబంధి విచారము పూర్వము ఆలంకారికులు చేసిరి. వారి నిర్ణయములు సర్వకళాక్షేత్రమున అంగీకరింపబడినవి. ఇపుడు పాశ్చాత్యమైన దృక్పథము బలిసినది. ఏది యెట్లున్నను మానవునకు అపకారము చేయని సుఖానుభవదాయియైన వాగ్రూపము అభ్యుదయసాహిత్యమనుటలో మనకు విభేద ముండరాదు.

తెలుగు నాటకరంగమున అభ్యుదయ నాటకములన్న వ్యవహారము, శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము పేర్కొనుటతో ప్రారంభమగుచున్నది. అంతకుముందున్న నాటకములకన్న ఆ నాటకమునందున్న ప్రత్యేక లక్షణములు దీనికి కారణములైనవి. కన్యాశుల్కమునకు పూర్వము సంస్కృత, ఆంగ్లరూపకముల అనువాదములేకాని, తెలుగున స్వతంత్రములైన రూపకములు చాల తక్కువగా నుండెను. ఈ నాటకము తరువాత ప్రవర్తిల్లిన రూపకసాహిత్యమంతయు నేను చేయుచున్న విచారణలో చేరును.

గురజాడవారి కన్యాశుల్కము మొదటిసారి 1887 లో ప్రచురింపబడినది. ఈ నాటకముపై ప్రత్యక్షముగా పాశ్చాత్య ప్రభావము గోచరించును. దీనికి సంస్కృత ఆంగ్ల రూపక లక్షణములలో ఏ లక్షణములును పట్టవు. ఆస్కార్‌వైల్డ్, బెర్నార్డ్‌షా మున్నగు ఆంగ్ల రచయితల రచనారీతి ఇచట గోచరించును. కన్యాశుల్క రచనలో విదేశీయ ప్రభావమేగాక ప్రాచ్య నాటక పునరుజ్జీవనదృష్టియు రచయితకున్నట్లు మనకు గోచరించును. మధురవాణి పాత్రలో శూద్రకుని, వసంతసేనను ఆదర్శముగా గ్రహించినట్లు తెలియవచ్చును. ఈ నాటకరచనయందు గురజాడవారు ఆనాటి సాంఘిక శక్తుల సమగ్రవ్యక్తీకరణము చేయగలిగినారు. గ్రాంథిక భాషావాదముపై తిరుగబడి, వ్యావహారికమునే సాహిత్యభాషగా స్వీకరించి నాటకమును రచించినా... వ్యావహారిక భాషలో తొలిసారిగా కె. వి. ఆర్. కృ...రావుగారు 'అపవాద తరంగిణి' అనుపేర 'షెరిడాన్' వ్రాసిన 'స్కూల్ ఆఫ్ స్కాండల్' అను నాటకమును గద్యరూపకముగా అనువదించినారు. వ్యావహారిక భాషకు తన స్వతంత్రమైన నాటకములో ప్రవేశము కల్గించుటలో గురజాడవారు కృతకృత్యులైనారు. ఇంతకుపూర్వమే వేదము వెంకటరాయ శాస్త్రిగారు ప్రతాప రుద్రీయమునందు పేరిగానిపాత్రకు గ్రామ్యభాషను వాడి పాత్రోచిత భాషావాదమును నిలబెట్టినారు.

వీరేశలింగముగారి సంఘ సంస్కరణోద్యమము ముమ్మరముగా సాగుచున్న రోజులవి. విధవా వివాహములు, బాల్య వివాహములపైన ఏవగింపు, కన్యాశుల్క నిరోధము. మొదలైనవి నాటి సంస్కర్తల ఆశయములు. ఈ ఆశయములు నాటకములందు సర్వత్ర బలపరచబడినవి. ఆనాటి సంస్కర్తలు గుర్తింపలేని ఆంగ్ల ప్రభావముయొక్క వికృత స్వరూపమును గుర్తించి గురజాడవారు గిరీశం పాత్రను సృష్టించినారు. నాగరికతా భ్రాంతిమూలకమైన అనాగరికతను చుట్టుకొని గిరీశం చిట్టచివరకు "డామిట్! కథ అడ్డం తిరిగింది" అని తన నైష్ఫల్యమును సూచించుచు నిష్క్రమించును.

ఇది నాటక పర్యవసానము. గురజాడవారి నాటకము దేశీయములైన ఆచారములలోని వెఱ్ఱివేషములను, వెక్కిరించుటయే గాక, గిరీశం పాత్రద్వారా పాశ్చాత్యభావ మోహితమైన యువలోకమును మంచి మార్గమునకు మరల్చుటయే ప్రధానముగా స్వీకరించినది. ఈ నాటక రచనా విధానముగూడ క్రొత్త పోకడలు పోయినది.

గురజాడవారు ప్రారంభించిన నూతనోద్యమమును కొన్ని సంవత్సరములవరకు ఎవరును నిర్వహింపలేదు. తిరుపతి వేంకటకవులు మొదలగువారు రచించిన రూపకములు ప్రాచీన సంస్కృత రూపకములకు గ్రుడ్డి అనుసరణలుగా మాత్రమే రచింపబడినవి. వీనియందు పద్యబాహుళ్యము భాషలోని లాక్షణికత తెలుగు రంగస్థలమునకు కొంత అపకారము చేసినవి. తరువాత ఔత్సాహిక నటబృందము వచ్చువరకును తెలుగునాటకమన కేవలము పద్యములను పాడువారి సమ్మేళనము అయినది. ఈ నాటకములయందు ఏ ఒకటి రెండింటికో తప్ప మిగిలినవానికి సాహిత్య గౌరవము గూడ లేదు. ఒకరు గ్రహించిన ఇతి వృత్తమునే పదిమంది గ్రహించి నాటకములందలి వైవిధ్యమును సాధింపలేక పోయినారు. మొదటి ప్రపంచ యుద్ధమునకు తరువాత తెలుగుసాహిత్య రంగములో భావకవిత్వోద్యమము పాదుకొన్నది. ఇంచుమించుగా యీ కాలముననే శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు "నదీసుందరి"ని రచించిరి. రచయిత "అభినవమ్మగు రూపక మాంధ్రభాష నర్పణము చేయుచున్నాడ"నని చెప్పుకొనినాడు. ఈ రూపకము ఎన్నడో తన హృదయసీమయందు కావేరీనది పూచిన పరిమళములు కారణములుగా రచింపబడినది. కవేరకులపతికి నదీ కన్యయైన కావేరి లభించెను. సహ్యాద్రి యందలి దేవీపంజరమను నికుంజమున ప్రవేశించినచో ఆమె నదియైపోవునట. కవేరు డెంత జాగ్రత్తగ నున్నను ఆమె తన సర్వస్వముగా భావించు అగస్త్యుడు ఆమె సుఖముకొరకై సహ్యాద్రికి కొంపోయెను. ఆమె నది అయ్యెను. ఈ రూపకములోని కథ యిది. ఈ రూపకమునందు ఒక నదీకన్య తాను నదియగువరకును పొందిన వేదనను కవి కథాకస్తువుగా స్వీకరించినాడు. ప్రకృతిలోని నదిని పాత్రగా స్వీకరించిన ఆధునిక రచనలో ఇది మొదటిది. ఈ రచనయంతయు సుందరముగ, లలితముగ సాగినది. భాష గ్రాంథికము. గురజాడవారు ప్రారంభించిన ఉద్యమము సాహితీసమితి కాలమందు కొత్త రూపమున వికాసము నొందినది. ఈ రచనలో కవితాగుణము లెక్కువ. ఈ కాలముననే తెలుగు సాహిత్యములో శక్తిమంతులైన ఇరువురు రచయిత లుద్భవించినారు. ఒకరు శ్రీ చింతా దీక్షితులుగారు. మరియొకరు గుడిపాటి వేంకటచలంగారు. ఈ యిరువురు రచయితలును తెలుగులో కథానికను. నాటికను దిద్దితీర్చినారు. ఇద్దరిలోను సౌందర్యారాధనయందు మమత ఎక్కువ కాన్పించును.

దీక్షితులుగారు గొప్ప సౌందర్య పిపాసగల వ్యక్తి. పశువులందు, పక్షులందు, శిశువులందు సృష్టిమహత్త్వమును చూచి ఆశ్చర్యపోయినవారు. ఈయన గొప్ప ఆధ్యాత్మిక సాధకుడు. ఈయన రచించిన నాటికలలో శర్మిష్ఠ, వరూధిని, చక్రవాక మిథునము, దసరా దిబ్బ, రేణుక, శ్రీకృష్ణుడు అన్నవి ముఖ్యములు. వరూధినియందు దీక్షితులుగారు అల్లసాని పెద్దనగారి వరూధినీప్రవరోపాఖ్యానమునకు క్రొత్త వ్యాఖ్యానము చేసినారు. వరూధిని పాత్రనుగూర్చి అతఃపూర్వమున్న అపోహలను తొలగించినారు. వీరి "శ్రీకృష్ణుడు"లో పిల్లల మనస్తత్వము అతి సుందరముగ సూచింపబడినది.

ఈయననాటిక లన్నింటియందును "శబరి" ముఖ్యమైనది. తెలుగుసాహిత్యములో 'శబరి', 'పురూరవ' అందుకొన్నంత ఆధ్యాత్మిక ఔన్నత్యము మరి యే యితర తెలుగు నాటకములు అందుకొన్నట్లు లేవు. "శబరి"లో నీచజాతికి చెందిన స్త్రీ సద్గురు సాన్నిధ్యమువలన ముక్తిని పొందుట సూచితమైనది. నాటకము ఐదంకములుగా శబరియొక్క ఆధ్యాత్మిక సాధనా వివరణ రూపముగా కూర్చబడినది. ఇందులో హనుమంతుని పాత్ర శబరికి శ్రీరామ దర్శనము కాకపూర్వము ప్రవేశ పెట్టబడినది. ఇఱ్ఱి, కోకిలలు, చిలుకలు, నెమళ్ళు, అన్నీ శ్రీరామచంద్రుని సపర్యాపర్యాప్తబుద్ధులైనవి. "ప్రకృతిసౌందర్యము అంతా ఆయనకు ధారపొయ్యాలి. మానవహృదయంలో మాధుర్యము ఆయనకోసము వెచ్చించాలి" అని ఈ నాటకములో శబరి పలుకును. శ్రీరామచంద్రుని వృత్తాంతమును ఎప్పటికప్పుడు పావురములు శబరికి అందించుచున్నవి. ఇట్లు యీ నాటకమందు సృష్టి సర్వమును పరమేశ్వరాభిముఖముగా తీర్చుటలో శ్రీ దీక్షితులుగారు కృతకృత్యులైనారు. గురజాడవారు ఉద్యమించిన వ్యావహారిక భాషను యీయన నాటకమునందు వినియోగింప గల్గినారు.

దీక్షితులుగారివలన ప్రేరణపొంది అనంతమైన సాహిత్యమును సృష్టించి దేశములో దుమారమును కల్పించిన రచయిత శ్రీ చలం. చలంగారు 1923 లో "చిత్రాంగి"ని రచించిరి. తరువాత ఈయన జయదేవ, భానుమతి, సావిత్రి, మృత్యువు, శశాంక, పురూరవ మున్నగు నాటకములు రచించిరి. ఈయన స్త్రీ పురుష సంబంధమైన కామభావమును ప్రధానముగా స్వీకరించి తన సాహిత్యమును నిర్మించి

నారు. చలంగారు వైవాహిక సంస్థను గూడ కాదన్నవారు. డి. హెచ్. లారెన్సు, మపాసా, మీటర్‌లింక్ మొదలైన రచయితల రచనలు ఈయనకు మార్గదర్శకము లైనవి. మనస్తత్వ శాస్త్రములో ఫ్రాయిడ్ ప్రతిపాదించిన సిద్ధాంతముల ప్రభావము ఈ రచయితలపైన విశేషముగ నుండెను. చలంగారి తొలి రచనలో వైవాహిక సంస్థయొక్క దౌర్బల్యము, స్త్రీ పురుషుల స్వచ్ఛంద ప్రణయము, దాని ఔన్నత్యము చిత్రింపబడినవి. ఈ తిరుగుబాటు దేశములో అనుకూల్యమునకన్న వ్యతిరేకభావమునే కల్గించినది.

చలంగారి రచనలలో తెలుగుభాష క్రొత్త అందమును, క్రొత్త శక్తిని సంపాదించుకొన్నది. ఈయన భాష ప్రాచీనములైన వ్యాకరణసంప్రదాయములను సంపూర్ణముగా ఛిన్నాభిన్నము చేసినది. ఒక అన్వయము గాని, ఒక వాక్య స్వరూపము గాని, ఈయన రచనకు నిర్ణయించుట కష్టము అయినను ఈయన వచనము మిక్కిలి శక్తిమంతమైనది. చిత్రాంగిలో చలం అంతకుపూర్వమున్న కథను తలక్రిందులు చేసి, చిత్రాంగి పాత్రకు గొప్ప ఔన్నత్యమును చేకూర్చినారు. ఈ చిత్రాంగి ఇతరుల సారంగధరచరిత్రలో కన్పించు వేశ్యవంటి రాణికాదు. ఆమె మనసార ప్రేమించిన రాజకుమారునికై చిట్టచివరకు ప్రాణత్యాగము గూడ చేసినది. సంఘములోని కొన్ని బలవత్తరములైన శక్తుల ఒత్తిడి తాగలేక అమాయకులైన జీవులు నశించిపోవుటయీ నాటకమున కితివృత్తము. ఈయన భానుమతిలో గొప్ప అభిమానముగల ఇరువురు రాణులు ఎదురెదురుగా నిలబెట్టి చూపింపబడినారు. కేవల మొక రాణిగా భట్టనారాయణుడు 'వేణీ సంహారము'లో చూపించిన భానుమతిని భారతీయ సమ్రాజ్ఞిగా రూపించి ప్రాణము పోసినారు. దురభిమానముగల ద్రౌపది భానుమతీదేవిముందు వెలవెల పోయినది. ఈ దురభిమానమే ఆమె అవమానమునకు కారణభూతమైనది. ఈయన జయదేవలోని జయదేవుడు అనంతమైన సౌందర్యపిపాస గలవాడు. ఎక్కడ సౌందర్యమున్నను అతని సర్వేంద్రియములు దానిని తమ అధీనముగా చేసికొనుటకు తహతహ లాడిపోవుచుండెను. అందువలన చివరివరకును సన్యసించినను ఈ స్త్రీలోలత్వము వదలలేదు. ఈ నిరంతరాన్వేషణలో చలంగారి జయదేవుడు మహా భక్తుడైనాడు.

ఈ విధముగా నాటకములు, నాటికలు రచించి దీక్షితులుగారు, చలంగారు తెలుగునాటకస్వరూపమును ఉద్దీపింపజేసినారు. ఈ కాలముననే విశ్వనాథ సత్యనారాయణగారు 'అనార్కలి, నర్తనశాల' రచించిరి. 'అనార్కలి, అనార్కలి సలీముల ప్రణయ సంబంధిగాథ. ఇది పూర్వాంకము, ఉత్తరాంకము అని రెండంకములుగా విభజింపబడినది. పూర్వాంకమందు పూలకన్నెలు, వసంతుడు, కోకిలలు, చిలుకలు మొదలైన శృంగారరస ఉద్దీపక సామగ్రి పాత్రలుగా ప్రవేశపెట్టబడినవి. ఈ నాటకమందు ప్రదర్శనానుకూల్యముకన్న గీతభావము (Lyrical element) ఎక్కువ. నర్తనశాలలో కీచకునిపాత్ర అతి గంభీరముగా చిత్రింపబడినది. ఈ నాటకమున కీచకుడే నాయకుడు. ఈ నాటక రచనా క్రమమునందు సంస్కృత రూపక లక్షణ మర్యాదలు విదూషకాది పాత్రలు ప్రవేశపెట్టుటయందు గోచరించును. ఉత్తర పాత్రను చాల సున్నితముగా ఈ నాటకమున నిర్వహించినారు. ఈ కాలమున వచ్చిన కొన్ని నాటకములలో కొన్ని సామాన్య లక్షణములు కన్పించుచున్నవి. చాలవరకు సంపూర్ణముగ వచనములో రచింపబడుట ఒక లక్షణము. కొన్ని నాటకములందలి వచనము ఇంకను గ్రాంథికముననే రచింపబడుచున్నది.

ఈమధ్య ఒక విచిత్రమైన స్థితి జరిగినది. అది మనకు ఆశ్చర్యమును కల్గింపవచ్చును. సాహిత్య అకాడమీవారు ప్రకటించిన ఇండియన్ లిటరేచర్ లో శ్రీ ఆచంట జానకిరామ్‌గారు తెలుగు నాటకములనుగూర్చి వ్రాసినారు. మన దేశమునందు కొంచెము పేరువచ్చినవాడెవడైనను ప్రతి విషయమునందును తానే ప్రమాణమనుకొనును. బహుభాషా సమ్మేళనమునందు ఒక భాషకు ప్రాతినిధ్యము వహించుటచేత దానికి అన్యాయము చేయరాదు. ఈ వ్యాసమందు అది జరిగినది. జానకిరామ్‌గారి వ్యాసములో దీక్షితులుగారి 'శబరి', నరసింహశాస్త్రిగారి 'సోమనాథ విజయము' ఏకాంకికలుగ చెప్పబడినవి. ఇది వారి సర్వజ్ఞత్వమునకు తార్కాణము. మిగిలిన భాషలవారు మాత్రము తమ భాషకు ఏమాత్రము న్యాయము చేకూర్చుచున్నారని అడుగవచ్చును. ఒక తప్పును వేరొకరు చేసిన తప్పును సమర్థించలేదు. పైన చెప్పినది ఒక ఉదాహరణ మాత్రమే. కాని వ్యాసమంతయు ఇట్టి విచిత్రములైన విషయములతో నిండియున్నది. ఒక అసమర్థుని సమర్థుడనుకొని పిలచినపుడు తనకు చేతగాదని చెప్పవలెను. లేనిచో పదిమంది తెలిసినవారి దగ్గరకేగి విషయమును గ్రహింపవలెను. ఈ రెండును శ్రీ జానకిరామ్ గారు చేయలేదు. ఇది మనము మనముగూర్చి చెప్పుకొను పద్ధతి. ఇటు ప్రభుత్వమునకు పట్టలేదు. అటు సారస్వత చక్రవర్తులకును పట్టలేదు.

కొద్దికాలములో ప్రదర్శించుటకు యోగ్యములైన సాంఘికేతి వృత్తము గలవి రచించినవారు శ్రీ రాజమన్నారుగారు.

నార్ల వేంకటేశ్వరరావుగారు. రాజమన్నారు, చలం, ముద్దు కృష్ణల రచనలు 'జ్వాల', 'కళ' లలో మొదటిసారిగా ప్రచురితములైనవి. ఈ నాటకములందు సెట్టింగులు, వేషములు లేకపోవుటచేత ఎందరినో ఆకర్షించినవి. ఏవిద్యార్థులైన నుపరిమిత పాత్రలుగా ఈ నాటకములను ప్రదర్శించుటలో ఉత్సాహము చూపుచుండిరి.

కేవలము నాటక ప్రదర్శనమునకు సంబంధించిన పరిస్థితులే గాక, ప్రథమ ప్రపంచ సంగ్రామము తరువాత పశ్చిమ దేశములో వచ్చిన ఏకాంకికలు, 1932 లో ఆంధ్రదేశమున కలిగిన ఆర్థిక సంక్షోభము, తెలుగు నాటకోద్యమములో కొత్తగా ప్రవేశించిన అభ్యుదయోద్యమము, వీరి నాటకముల రచనకు ప్రోత్సాహ కారణములయినవి. రాజమన్నారు రచించిన 'ఏమిమగవాళ్ళు' అన్న నాటికలో పెద తండ్రిని ధిక్కరించి ఒక వేశ్యను వివాహమాడిన యువకుడు చిత్రింపబడినాడు. సామాన్యముగా అందరును పెద్దమనుషులుగా వ్యవహరించినను వారు సంఘపు కట్టుబాట్లకు లొంగిగాని నిజముగ నీచవాంఛకలవారేనని ఈ నాటకము నిరూపించుచున్నది. ఎంత సంస్కారము కలవాడననుకొన్న పురుషుడును, స్త్రీని అనుమానించుచునే యున్నాడు. రాజమన్నారు రచనలలో సంక్షిప్తత యెక్కువ. రచయిత తన ఉద్దేశ్యమును వాచ్యముగాగాక వ్యంజనా స్వరూపమున నిరూపించును. రాజమన్నారు రచించిన 'తప్పెవరిది' అను నాటకము ద్వారా ఆధునిక నాటకరంగ చైతన్యానికి కారకులని శ్రీ వేణుగోపాలస్వామివారు చెప్పినారు. కందుకూరి, రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు సాగించిన సంస్కారోద్యమమువలన ప్రజలలో వ్యాపించిన నైతికాడంబరత్వమును ఈ నాటకములలో ఈయన వెక్కిరించినాడు.

శ్రీనార్ల వ్రాసిన నాటికలు నాటికారంగములో విభిన్న శిల్ప ప్రక్రియకు చెందినవి. యూజిన్ ఓనీల్ 'Before Breakfast' అనే ఏకాంకికను ఆదర్శముగా ఒక పాత్రను రంగస్థలముపై నిలిపి వేరొకపాత్రను నేపథ్యములోనుంచి 'దొంగ-దొరా' అను నాటికను నిర్వహించినారు. మిగిలిన నాటికలయందును ఈ శిల్పవైవిధ్యము కన్పించును. భంగపాటు, కొత్తగడ్డ, ప్రారబ్ధము అను నాటికలు ఉత్తమములయినవి. పల్లెటూరి జనుల అజ్ఞానము, మూర్ఖత్వము, సంకుచితమైన మనస్తత్వము ఈయన తన నాటకములలో చూపించినాడు. వాక్చిత్రము అనుపేర రేడియోలో ప్రచారము చేయబడుచున్న నాటికలన్నియు ఈ జాతికి చెందినవే. సహజమైన చమత్కారదృష్టి, అకృతకములయిన ప్రేమానురాగములు ఇందు వర్ణితములు. వ్యర్థమైన సోమరితనము వలన కలుగు నష్టములను 'ప్రారబ్ధము' ప్రదర్శించుచున్నది. ఇంచుమించుగా ఈ కాలముననే దువ్వూరి రామిరెడ్డిగారు 'ఒథెల్లో'ను ఆదర్శముగా కుంభరాణా అను విషాదాంత నాటకమును రచించినారు.

1930 తరువాత ఆంధ్రదేశములో 'జస్టిస్‌పార్టీ' తలయెత్తినది. వీరు ముఖ్యముగా నీచజాతులవారిని అగ్రజాతులవారు కొన్నివేల సంవత్సరములుగా అణచివేయుట ప్రధానకారణముగ దానికి ప్రతీకారోద్యమము చేయుచుండిరి. ఈయుద్యమమునకు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు నాయకత్వము వహించిరి. ఆయన సకల సారస్వతమును బ్రాహ్మణుల నైచ్యమును వర్ణించుట, శూద్రుల ఔదార్యమును కొనియాడుటగా నున్నది. ఈయన పురాణములలోని కథలను స్వీకరించి ఆధునిక సాంఘిక వ్యవస్థను దృష్టియం దుంచుకొని క్రొత్త వ్యాఖ్యానములు చేసినారు. ఈయన రచించిన 'శంబూక వధ' రామాయణ కాలము నాటి ఇతివృత్తమును స్వీకరించినది. ఈ నాటకమునందు దుష్టులైన వసిష్ఠాదుల బలవంతముచేతనే శ్రీరామచంద్రుడు శంబూకవధ చేసినట్లు నిరూపించినాడు. ఈయన 'ఖూని' గూడ ఇట్టి మరియొక నాటకము. ఈ మార్గమున ప్రాచీనములైన విశ్వాసములను, సంప్రదాయములను విచ్ఛేదించుటకు ఆ కథలే స్వీకరించి క్రొత్తగా వ్యాఖ్యానము చేసినవారు శ్రీ ముద్దుకృష్ణ, గుడిపాటి వేంకటచలం, ఆమంచర్ల గోపాలరావు. ముద్దుకృష్ణ వ్రాసిన అశోకము పాతివ్రత్యమునకు ప్రమాణమైన సీతాదేవినిగూర్చి వ్రాసినది. ఇందు రావణుడే రామునికన్న ఉత్తముడైనట్లు, సీతాదేవి రావణునియందు ప్రేమ కలిగి యున్నట్లు చెప్పబడినది. చలంగారు రచించిన హరిశ్చంద్ర, నరసింహావతారము, సీత అగ్ని ప్రవేశము మొదలైన నాటికలు ఈ కోవకు చెందినవి. పరమ సత్యవ్రతుడైన హరిశ్చంద్రుడు చలంగారిచేత కేవలము పిచ్చివాడుగా చిత్రింపబడినాడు. ఇది ఒక అవహేళన. నరసింహునకు ప్రహ్లాదునిమీద అసహ్యము, హిరణ్యకశిపునిమీద అమితమైన ప్రేమయు నున్నట్లు నరసింహావతారమున రచయిత చెప్పుచున్నాడు. ఆమంచర్ల గోపాలరావుగారి 'హిరణ్యకశిపుడు' అను నాటకముగూడ ఈ మార్గమున రచింపబడినదే. ఇదియొక ఎక్స్ట్రీమిటీ.

కొన్ని యుగములుగా వచ్చుచున్న ఒక విశ్వాసమును రచయిత కాదనుటవలన పాఠకునిలోని రసాస్వాదనకు అడ్డు వచ్చుచున్నాడు. సీతాదేవి పాతివ్రత్యము, హరిశ్చంద్రుని సత్యపారమ్యము కాదని చెప్పుట కేవలము రచయిత యొక్క సంప్రదాయ వ్యతిరేకతను చూపించును గాని,

పాఠకుని సానుభూతిని సంపాదింపలేదు. ఈ కాలములో మనకున్న అభిప్రాయములను కొన్నివేల సంవత్సరముల నుండి సుష్ఠుగా ప్రతిష్ఠితములైన పాత్రలమీద ఆరోపించ బూనుటవలన ఔచిత్యము దెబ్బతినుచున్నది. ఈ నాటకము లందు సాంకేతికముగా ఎంత గొప్పదనము సాధించినను రచయితయొక్క ప్రచారధోరణి మిక్కుటమైనది. ప్రజల విశ్వాసములను కాదనుటవలన వీనికి ప్రదర్శన యోగ్యత గూడ లేకపోయినది. డాక్టరు జి. వి. కృష్ణారావుగారు రచించిన భిక్షుపాత్ర గూడ ఈ తరగతికి చెందిన రచనయే. వ్యాసునినాటి పరిస్థితులకు ఆధునికమైన "మార్క్సిస్టు" వ్యాఖ్యానము చేయబడినది. కాని రచయిత దీనిని సమర్థముగా నిర్వహించినాడు. అందువలన ఔచిత్యభంగము కలుగలేదు.

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు "మోలియర్" మొదలైన పాశ్చాత్యరచయితలను అనుకరించి ఎన్నియో నాటకములను రచించిరి. ఇవన్నియు హాస్య ప్రధానములైన నాటకములు. కందుకూరి, చిలకమర్తివారి ప్రహసనముల లోని హాస్యముకన్న ఈ హాస్యము లలితముగా నున్నది. వీనిలో బాగు-బాగు మొదలైన నాటకములు ఎన్నో పర్యాయములు ప్రదర్శనములు పొందినవి. కొందరు రచయితలు సంస్కృత రూపకములను ఆధునిక ప్రదర్శన కనుకూలముగా సంపూర్ణ గద్య నాటకములుగ పరివర్తించిరి. భమిడిపాటి కామేశ్వరరావు "మృచ్ఛకటిక, ముద్రారాక్షసముల" నీరీతిగ ననువదించిరి.

తెలుగుభాషలో గీత నాటకమునకు తొలిరచయిత శ్రీ శివశంకరశాస్త్రిగారు. ఆంగ్లనాటకముల ననువదించునపుడు వానిలోని 'బ్లాంకువర్సు' ననుసరించి వీరేశలింగము మొదలయినవారు పద్యనాటకముల రచించిరి. కాని శివశంకర స్వామి స్వతంత్రములయిన పద్యగేయ రూపకములను అనేకములను సృష్టించినారు. వీనిలో 'దీక్షిత దుహిత' 'కవిప్రియ' 'పద్మావతీ చరణచారణచక్రవర్తి' మొదలయినవి మిగుల ప్రఖ్యాతములైన రూపకములు. ఈ రూపకములలోని రూపకత్వముకన్న కావ్యత్వమే మెండుగా గోచరించును. 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి'లో గీతగోవింద కర్తయైన జయదేవుని కథ స్వీకరింపబడినది. ఈయన రచించిన సర్వ రూపకములలోను ఇది శిరోభూషణమని విమర్శకుల అభిప్రాయము. ఈ గీతిరూపకములు వీరి తరువాత రేడియో ప్రోత్సాహము కలుగువరకు ఎక్కువమంది రచింపలేదు. రేడియో ప్రోత్సాహమువలన నీ కాలలో ఉత్తమ రూపకములు రచింపబడినవి. కృష్ణశాస్త్రిగారి 'ధనుర్దాసు' 'ఆండాళ్', రజని రచించిన 'లకుమ' మొదలయినవి సుప్రసిద్ధములు.

టి.యస్. ఇలియట్, క్రిస్టఫర్ మొదలగువారి మార్గమందు ఆరుద్ర 'వేదనాశకలము' 'ఉద్గీథ' వగైరా రూపకములను రచించెను. 'ఎర్నెస్టు టాలర్' రచించిన ఒక రూపకమును శ్రీ సోమసుందర్ 'మందీ - మనిషి' అను పేర అనువదించెను. ఇది జాగ్రత్‌స్వప్నస్థితులకు జెందిన నాటకము.

రేడియోవలన మన సాహిత్యములో పెరిగిన క్రొత్త ప్రక్రియ రేడియో నాటిక. ఇది కేవలము శ్రవ్యమైనదగుట వలన దృశ్యరూపకములలోనున్న ఆహార్యాదులు దీనియందుండవు. అందువలన వాగ్వ్యవహారము మీద రూపకమంతయు విజయవంతమగుట ఆధారపడి యుండును. ఈ ప్రక్రియలో చాలమంది చేయి పెట్టిరిగాని పరిణతి పొందిన రచయితలు కొద్దిమంది. శ్రీ గోరాశాస్త్రి వీరిలో ఒకరు. ఈయన అనేకములయిన శ్రవ్యరూపకములను రచించినాడు. ఈ ప్రక్రియ పాశ్చాత్య దేశములనుండి ఎరువుతెచ్చుకొన్నదే. ఈ నాటికలలో కొన్ని ఏకపాత్రవాక్చిత్రములు గూడ గలవు.

ఈకాలమునందు శ్రీశ్రీ రచించిన మరోప్రపంచం మొదలైన శ్రవ్యరూపకములు వెలువడినవి. ఈ రూపకములలో ఈ కవియొక్క లోతైన భావశక్తి, కల్పనా సమున్మేషణము (Evolution of Imagination) స్పష్టమగును. "బలి" అన్న నాటిక వీనియందు శిరోభూషణమువంటిది. పుణ్యముచేత ఆవరింపబడిన పాపి స్వర్గ సౌఖ్యముల ననుభవించుట, పాపముచే చుట్టబడిన ఉజ్జ్వల పురుషుడు దుఃఖమనుభవించుట ఇందు చక్కగా నిరూపింపబడినది. గొప్ప ఆత్మశక్తి గల మహాపురుషునకు త్రిలోకములందు అడ్డు లేదని ఈ కృతి నిరూపించినది. 'సుప్తాస్థికలు' అన్న నాటిక మహాత్ముని మరణముమీద విశ్వము పొందిన ఆవేదనకు వ్యాఖ్యానము. మహాత్ముని గూర్చి రచింపబడిన కృతులలో ఇది శ్రేష్ఠమైనది.

1940-50 ల నడుమ రూపకములు రచించిన వారిలో పేర్కొనదగినవారు బుచ్చిబాబు, ఆత్రేయ. బుచ్చిబాబు రచించిన "తిష్యరక్షిత" "ఒమర్‌ఖయామ్" "ఆత్మవంచన" చాల ప్రధానములైన నాటికలు. ఆత్మవంచన ఈయన రచించిన రూపకములలో శ్రేష్ఠమైనది. తెరబడని నాటకములో రాజా, పిచ్చివాడు, మంత్రి మొదలైన పాత్రలను చిత్రించుటలో బుచ్చిబాబు తన అసాధారణ ప్రజ్ఞను ప్రదర్శించినాడు. దీనియందలి హాస్యమునందు కరుణారసచ్ఛాయయు కలదు. ఆచార్య ఆత్రేయ నాటకములు చాల ప్రసిద్ధికెక్కినవి. ఇవి వందలసార్లు ప్రదర్శింపబడినవి. ఇవన్నియు

ప్రదర్శనము నుద్దేశించి వ్రాయబడినవి. అద్దెకొంప, ప్రగతి మొదలైన నాటకముల ఇతివృత్తము సంఘములోని పరిస్థితులకు ప్రతిబింబముగా నుండి ఎక్కువమందిని ఆకర్షించినది.

ఈయన రచించిన 'కప్పలు' ఉదాత్తమైన వ్యక్తీకరణ గల నాటకము. ఈ నాటకము రచింపబడినంత సుస్పష్టంగా చాల నాటకములు రచింపబడలేదు. కొప్పరపు సుబ్బారావుగారు తొలికాలమున "రోషనార, తారాశశాంక" మొదలైన నాటకముల రచించిరి. ఈయన "నేటి నటుడు" "చేసినపాపము" మొదలైన ఏకాంకిలను రచించెను. "అల్లీముదా" వీరి గేయ నాటిక. ఇది తెలుగులోని మొదటి గేయరూపకము.

1945 ప్రాంతములో విజయవాడలో స్థాపించబడిన ప్రజా నాట్యమండలి తెలుగునాటక ప్రదర్శనములో క్రొత్త శకమును ప్రారంభించినది. దీని కృషిచేత నాటకములను విరివిగా ప్రదర్శించిరి. వీరు ప్రదర్శించిన నాటకములలో "మా భూమి" ముఖ్యమైనది. దీనిని "సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు" రచించినారు. వందల యేండ్లుగా ముస్లిం పరిపాలనలో నిద్రాణమైయున్న తెలంగాణము మేల్కొని విప్లవము ప్రారంభించుట ఈ నాటకములోని ఇతివృత్తము. ఈనాటకము ప్రభుత్వమువారి నిషేధాజ్ఞకు గూడ గురియైనది. పింగళి నాగేంద్రరావు రచించిన "వింధ్యరాణి", "ఒకే కుటుంబము" గూడ ప్రదర్శితములైనవి. ఒకే కుటుంబంలో రచయిత ప్రపంచమంతయు ఒకే కుటుంబముగా కలసి మెలసి బ్రతుకుటను ప్రబోధించుచున్నాడు. తరువాత రచయితలలో పేర్కొనదగినవారు విశ్వనాథ కవిరాజు, గంగాధరరావు, డి. వి. నరసరాజు, సోమంచి యజ్ఞన్న శాస్త్రి, అనిశెట్టి సుబ్బారావు, పినిశెట్టి శ్రీరామమూర్తి, బెల్లంకొండ రామదాసు, కొండముది శ్రీరామచంద్రమూర్తి, నాగభూషణ్ మొదలైనవారు. వీరిలో చాలమంది ఇంగ్లీషు నాటకములు చదివి ప్రేరణపొంది రచించినవారే కాని స్వతంత్రముగా రచించినవారు కారు. అందుచే వీరివలన తెలుగు నాటకరంగమున జరుగవలసినంత కృషి జరుగలేదు. గొగోల్ వ్రాసిన "ఇన్‌స్పెక్టర్ జనరల్" ప్రీస్ట్లీ వ్రాసిన "ఇన్‌స్పెక్టర్ కాల్స్" అను నాటికలు బహుపర్యాయములనువాదితములైనవి. కథానికా రంగములో విజయము సాధించి నాటకములు గూడ రచించినవారితో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్ పేర్కొనదగినవారు. నాటకపరిణామదృష్ట్యా వీరి నాటకములకంత విలువలేకున్నను శ్రీపాదవారి "రాజరాజు" గోపీచంద్ గారి 'మాంచాల' పేర్కొనదగిన మంచి నాటకములు.

తెన్నేటి సూరిగారు 'సాహిత్యసమవాకార' మనుపేర అధునికాంధ్ర సాహిత్యమునుగూర్చి ఒక అధిక్షేపరూపకమును రచించిరి. ఇందలి రచనయు, నిర్వహణయు, సమర్థముగా నున్నవి. ఇట్టి అధిక్షేపరూపకములు తెలుగులో వెలువడలేదు.

ఇంత విస్తృతమైన నాటక రంగమును ఈ కొలది పరిధిలో సమీక్షించుట సాధ్యముగాదు. ఎన్ని నాటకములు వచ్చినను తాత్కాలిక ప్రయోజనములు కలవే ఎక్కువగా కన్పించుచున్నవి. రచింపబడిన నాటకములలో చాలవరకు ప్రదర్శనము నుద్దేశించినవి కావు. ప్రదర్శనకు ఉద్దిష్టములయిన నాటకములలో సహితము ప్రదర్శనానుకూల్యము తక్కువ. విజయవంతముగ ప్రదర్శింపబడిన మాభూమివంటి నాటకములు తాత్కాలిక ప్రయోజనము కలవిగా మిగిలిపోయినవి. ఇంతకాలము మన నాటకరచయితలు రచించిన వానిలో పేర్కొనదగినవి కొలదియే. కన్యాశుల్కము, ప్రతాపరుద్రీయము, ఈ శతాబ్దమునకు ముందే రచింపబడినను నేటికిని గొప్ప నాటకములవియే. ప్రదర్శనయోగ్యము కాకపోయినను చలంగారు రచించిన 'పురూరవ' తెలుగులోని ఉత్తమమైన రూపకము. కాళిదాసు, శ్రీ అరవిందులు, టాగూరు మొదలయినవారు ఊర్వశిని చిత్రించిరి. చలంగారి పురూరవలో ఊర్వశి ఒక దివ్యమైన ఆనందానుభూతిమాత్రమే. ఈ అనుభూతి నిరంతర సౌందర్యారాధకునకు మాత్రమే ఎన్నో జన్మల తపఃఫలముగా లభించును. యుగయుగములుగా సౌందర్యముకొరకై పరితపించిన పురూరవునకు ఊర్వశీ స్వరూపమైన ఆనందము లభించినది. మిగిలిన మహాకవుల ఊర్వశీ చిత్రమును చలంగారు ఈ నాటకములో అధిగమించి శాశ్వతములయిన సౌందర్యపరిధులను సృష్టించినారు. ఈ నాటకరచయిత సాధించిన అపూర్వమైన వాతావరణచిత్రణము తెలుగులోని ఏ నాటకకర్తయు సాధించలేదు.

తెలుగు నాటకములలో ఎక్కువభాగము పాత్రల నుద్దేశించి వానిచుట్టు కథఅల్లిన నాటకములేగాని ఇతివృత్తమునే ప్రధానముగా స్వీకరించినవి లేవు. దీని వలన ఒక పాత్రను పుష్టిగా తీర్చగలిన రచయిత మిగిలిన యెడల అశ్రద్ధ వహించి నాటకములలోని వైరళ్యమునకు కారకుడగును.

ఏకశోద్యమమునకైనను ప్రధాన ఆశయము లివి: (1) రచయితయొక్క సృజనాత్మకమైన శక్తిని పెంపొందించుట. (2) వాస్తవికతను ప్రతిబింబించుటలో భావనా వైవిధ్యమును సంతరించుటకు ఆ రచయితయొక్క ప్రత్యేకతను నిలబెట్టుట.

జీవితమునకు వ్యాఖ్యానము చేయుటలో ఒక్కొక్క రచయిత ఒక్కొక మార్గము ననుసరించును. మన నాటక రంగములో వచ్చిన ఈ పునరుజ్జీవనము ఈ ఫలితములను సాధించినదా లేదా అన్న విచారము ముందువారు చేయవలసి యున్నది.

**మేరీ లేవిన్*** | # కథాంతం

ఒక రకంగా చెప్పాలంటే ఈ కథను రెండు రకాలుగా చెప్పొచ్చు! అంటే కథాంతం రెండు తీరుల్లో ఏ రకంగానైనా ఉండొచ్చు!

ఒక కుగ్రామంలో ఒక వితంతువు. కొండ మొదట్లో వాళ్ళిల్లు. ఆమెకు ఒక్కడే ఒక్క కొడుకు. వాడే తన బ్రతుకు.

కొడుకు 'పేకీ' కోసం ఆమె చెయ్యని త్యాగమంటూ లేదు. జీవితాన్ని వెచ్చించి, పక్క ఊళ్ళో ఉన్న మంచి స్కూల్లో చదువు చెప్పిస్తోంది.

'పేకీ' భవిష్యత్తుపై కలలు కనేది గాని గారాబం మాత్రం చేసేదికాదు. ఆట్టే మాట్లాడితే 'నువ్వు గనక సరిగ్గా చదువుకోకపోయావంటే నీ చేత తట్టలు మోయిస్తా, రాళ్ళు కొట్టిస్తా' అని మందలించేది గూడాను.

కాని రోజులు గడుస్తూన్నకొద్దీ, స్కూలుకు వెళ్ళే దారివైపు ఎట్లా ఆత్రతగా చూసేదో, స్కూలునుంచి తిరిగి వచ్చేటప్పుడు ఎంత ఆశగా ఎదురుచూసేదో, ఎంత ఆప్యాయతతో కొట్టుకు పోయేదో, ఆ ఊళ్ళో వాళ్ళకే గాకుండా, పేకీకి గూడా తెలిసిపోయింది. పైకి కనపరిచే హంగామా అంతా లోపల దాచుకోలేని సంతోషపు పొంగుల నురగలని అవగతమైపోయింది.

పేకీ కోసమే అహర్నిశాలూ శ్రమించడం. మైళ్ళకు మైళ్ళు నడిచిపోయి కాబేజీలు అమ్ముకు రావడం పొద్దున్నే దుంపలు తవ్వుకొని రావడం - బీడుగా పడిఉన్న భూమిలో సారవంతంగా ఉన్న పొరుగువాళ్ళ భూమికన్నా ఎక్కువ పండించటం - యివన్నీ పేకీకి ఎక్కువ పుస్తకాలుకొని పెట్టడానికీ, బట్టలు కుట్టించడానికిను. ఒక టేమిటి? ఏం చేసినా పేకీకోసమే.

పద్నాలుగేళ్ళొచ్చేటప్పటికి స్కూలునుంచి కాలేజీకి వెళ్ళే సమయం వచ్చింది. స్కాలర్ షిప్ గూడా వచ్చే అవకాశం కలిగింది.

అది జూన్ నెల. ఆ సంవత్సరం వర్షాలు లేవు. ఎటుజూసినా మండిపోయే ఎండ. కోడిపెట్టలు దిక్కుతోచక యిటూ అటూ టప టప కొట్టుకుంటున్నాయి.

'పేకీ కోసమా నిలబడ్డావు?' అంటూ అట్లా పోతూన్న ఒక వయసు చెల్లిన వ్యక్తి అడిగాడు. మీ అబ్బాయి యింత ఎండలో ఎట్లా సైకిలు తొక్కుకొస్తాడో ఏమో!'

'మావాడికి అదేం లేదు. ఎన్ని మైళ్ళ దూరంలోనైనా సరే తనకు కావలసిన ఒక పుస్తకం ఉన్నదని తెలుస్తే, ఎంత ఎండలోనైనా సరే వెళ్ళి రావలసిందే.'

'నడి వేసవిలో, ఆ కొండల్లోంచి వస్తూంటే, చల్లగాలి తగిలి హాయిగా ఉంటుంది. అదే శీతాకాలంలోనైతేనా చర్మం చీల్చేసినట్లుగా ఉంటుంది. అయినా యిదేమంత మాములు కొండ అనుకున్నావేమో మరి. దేశపటంలో తప్పకుండా ఉండి ఉంటుంది.'

---

**మేరీ లేవిన్ 1912 లో పుట్టింది. ఐర్లండులో విద్యాభ్యాసం. నేషనల్ యూనివర్సిటీ డబ్లిన్ నుంచి పట్టభద్రురాలు. ప్రసిద్ధికెక్కిన చాలా నవలలు, కథల సంపుటాలూ ప్రచురించింది.**

'వాటి సంగతి మావాడికి తెలిసే ఉంటుంది.'

'మావా దొస్తూన్నట్లున్నాడు' అంది ఆత్రతగా, మేఘంలాగ లేచిన దుమ్మును చూస్తూ.

గడబిడకి కోడిపెట్టలు టపటప రెక్కలు కొట్టు కుంటూ అటూ యిటూ తిరుగుతున్నాయి.

లేచిన దుమ్మూ దుమారం అక్కడ ఏమీ కనిపించనియ్యకుండా చేసేసింది. ఒక్కసారి అయోమయం. కోడిపెట్ట సైకిల్ క్రింద పడ బోయింది. వేగంగా కొండమీదనుంచి దిగుతూన్న పేకీ సైకిలు బ్రేకులు ఒక్కసారి నొక్కాడు. చేతులు జారడం - పేకీ క్రిందపడటం - దెబ్బ తగలటం - ఈ లోకంనుంచి శాశ్వతంగా తప్పు కోవడం - యివన్ని చాలా కొద్దిసేపట్లో జరిగి పోయాయి.

పేకీ తన ముందు లేనట్లు నమ్మలేకపోయింది పేకీతల్లి. ఎట్లా నమ్ముతుంది? తన ఆశ, భవిష్యత్తు, ఒకటేమిటి తన సర్వస్వం అయిన పేకీ ఒక కోడి పెట్టను రక్షించడంకోసం ప్రాణాలు అర్పిస్తాడా? కాదు కాదు. జరగదు జరగదు. అట్లా ఎన్నటికీ జరుగదు.

'కోడిపెట్ట నీ ప్రాణంకన్నా ఎక్కువ ఖరీదా? ఆ కోడిపెట్టను బ్రతికించడంకోసం నిన్ను నిష్కారణ ముగా చంపేసుకున్నావా, నా తండ్రీ' అంటూ దిక్కులన్ని దద్దరిల్లేటట్లు రోదించింది.

అన్నికోళ్ళూ తెగనమ్మినా, ఒక్క నెత్తురు చుక్కతో - మనిషి నెత్తురుచుక్కతో సమానం అవుతుందా? మనిషి రక్తానికి ఖరీదేమిటి?

ఇది సరేననుకోండి. ఇదే కథను యింకో రకంగా చెప్పుకుంటారు గూడాను. అయినా ప్రజలకు సంఘటనలను జ్ఞాపకం ఉంచుకోవడంకన్నా, తమకు యిష్టంవచ్చినట్లు సృజించుకోవడం అంటే సరదా. తేలిక. అందువల్ల ఆ సంఘటనను ఈ రకంగా గూడా చెప్పుకుంటారు. అసలు యిట్లా ఉండకపోతే. కబుర్లు చెప్పడం, కథలు వ్రాయడం - అనే రెండు ప్రత్యేకమైన కళలంటూ ఉండేవి కావు!

అంటే ఈ కథ చాలావరకు అదేరకంగా సాగుతుందనుకోండి.

పేకీ స్కూలుకు వెడుతూ ఉంటాడు. ఆ రోజున, ఎండలో, గంటను మ్రోగిస్తూ, ఈలపాట పాడు కుంటో, కొండపైనుంచి, వేగంగా వస్తున్నాడు.

'మావా దొస్తూన్నట్లున్నాడే' అంది. మేఘం లాగ లేచిన దుమ్మును బట్టి.

కోడిపెట్టలు గడబిడలో, ఏమీ తోచకుండా టప టపమని రెక్కలుకొట్టుకుంటూ, చిందరవందరగా అటూ యిటూ పరుగెడుతున్నాయి.

లేచిన దుమ్మూదుమారం ఏమీ కనిపించనియ్య కుండా చేసింది. ఒక్కసారి అంతా అయోమయం. కోడిపెట్ట సైకిలు క్రింద పడి హతమైపోయింది. రక్తం చెల్లాచెదరై ఒళ్ళంతా చిందింది. ఒక్కసారి సైకిల్‌ను పక్కకు విసిరేసాడు.

పేకీ తల్లి గట్టిగా అరచింది.

'అయ్యో కోడిపెట్టను చంపేసావ్...నీ పొట్టన బెట్టుకొన్నావే...నువ్వు కావాలనే చంపేసావు... నాకు తెలుసు...నాకు తెలుసు... '

'నేనా......'

'నాకు తెలుసు నీ సంగతి. నువ్వు కోడిపెట్టల్ని చంపేస్తే, నాకు ఆధారం ఉండదుగా? అప్పుడు నువ్వు చక్కగా చదువు మానెయ్యొచ్చునుగా! అదీ సంగతి.'

'ఆ పని నేనుచేస్తే ఎప్పుడోచేసి ఉండవలసింది నాకు నిజంగా కాలేజీలో చదువుకోవాలని ఉందంటే. నమ్ము. నేను ఈ స్కూలు విడిచివెడుతున్నాననీ, నాకు 'స్కాలర్‌షిప్' వచ్చిందని మాష్టారు చెప్ప డముతో, ఆ సంతోషం పట్టలేక నీతో చెబుదామని వేగంగా వస్తూన్నా...'

తను పేకీహృదయంతో నిస్పృహ కలిగించావనీ తన కోడిపెట్టను చంపేసాడనీ, ఒక్కసారి హృద యంలో ఏదో నిస్పృహ రేకెత్తింది.

ఇటూ అటూ పోగయిన జనంకోసమన్నా తను యింకా తిట్టాలి పేకీని. తప్పదు. అందువల్ల మళ్ళా, యింకా ఉద్రేకంగా అంది.

'స్కాలర్‌షిప్‌ట, స్కాలర్‌షిప్. స్కాలర్‌షిప్ దొరకంగానే నువ్వు స్వతంత్రుడవై పోయావను కున్నావా ఏమిటి? నీకు దానితోటే కొమ్ములు మొలిచాయా? స్కాలర్‌షిప్ మహా సరిపోతే స్కూలు జీతానికయ్యేను. నీకు బట్టలెవడు కొంటాడురా? నీకు పుస్తకాలెవడు కొంటాడను కున్నావు? నీ బూట్లు? మరచిపోయా, నీ మిగతా అవసరాలు ఎవడు తీరుస్తాడనుకున్నావు?'

'అది కాదమ్మా'

ఇంక ఏమన్నా వినిపించుకో దలుచుకోలేదు. ఎట్లాగైనా లోపలికి వెళ్ళి పేకీని అమాంతంగా కౌగలించుకోవా లనిపించింది.

'లోపలికి పో' అంటూ తోసేసింది, ఏమి చెయ్య డానికీ పాలుబోక.

ఇరుగు పొరుగుల వాళ్ళందరూ నవ్వుకుంటూ తమ దారిన తాము పోయారు.

ఇంట్లోకి వచ్చిన తర్వాత 'బట్టలు మార్చుకో', 'అన్నంతిను' అంటూ ఎన్నిరకాలుగా కోపం తగ్గించ డానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. సరే, ప్రొద్దునకల్లా వాడే దారికొస్తాడనుకుంది.

ఆ రాత్రి గడిచింది. ప్రొద్దున్నే పేకీ గదిలోకి వెళ్ళి చూసింది. పేకీ మంచం మాత్రం ఉంది. అంతా ఖాళీ!

ఊరంతా గాలించింది.

'పోలీసువాళ్ళకు గుర్తులు యిస్తే వాళ్ళు ప్రయ త్నించవచ్చు. అయినా పేకీ అదోరకమైనవాడు. అతిసున్నితమైన మనస్తత్వం అతనిది' అంటూ వాపోయారు స్కూలు అధికారులు.

కొద్దిరోజుల తర్వాత ఉత్తరం మాత్రం వచ్చింది పేకీ నుంచి.

అమ్మా,

నేను రాబోవటంలేదు గనక, నాకు స్కూల్లో యిచ్చిన స్కాలర్‌షిప్‌ను యింకొక విద్యార్థికి యిమ్మని చెప్పు. డబ్బు సమకూడగానే నీ కోడిపెట్ట ఖరీదు పంపించేస్తాను.

'పేకీ'

మళ్ళీ కొద్ది కాలంలోనే యింకో ఉత్తరం వచ్చింది.

అమ్మా!

నాకు ఒక ఓడలో ఉద్యోగం దొరికింది నాకు తరుచు ఉత్తరం వ్రాయడం పడదు. అయితే నీకు వారం వారానికీ కొంత డబ్బు పంపే ఏర్పాటు చేసాను. వీలుకాగానే నువ్వు నాకోసం ఖర్చు పెట్టిన డబ్బంతా పంపేఏర్పాటు చెయ్యాలని ఉంది.

'పేకీ'

అడ్రసు లేదు ఉత్తరం మీద.

తీరుబాటుగా కబుర్లు చెప్పుకోవడం మానలేదు ఆ ఊళ్ళో వాళ్ళు.

'ఆ కోడిపెట్టకోసం నీ జీవితం బలిచేసుకున్నావా బాబూ' అంటూ గోలపెడుతుందా వితంతువని అక్కడివాళ్లు అనుకుంటూ ఉంటారు.

అసలు మనంచేసే ప్రతి పనికీ ఈ సంఘర్షణ ఎదురౌతూ ఉంటుందనుకుంటా. ఈ ద్వంద్వం ఎంత క్లిష్టం నిజంగా? ఏది సరియైన మార్గమో ఎట్లా నిర్ణయించుకోగలం? విచక్షణాజ్ఞానం ఎంత అవసరం?

తెలికగా అధిగమించలేని అజ్ఞానం మనది. తీసుకొనే నిర్ణయంవల్ల వచ్చే ఉపద్రవంకన్నా, సరియైన నిర్ణయం తీసుకోకపోవడంవల్ల వచ్చే ఉపద్రవం అమితంలాగ కనిపిస్తోంది.

—అనువాదం : మురళీధర్

## ఆశ | మిరియాల రామకృష్ణ

చీమలబ్రమానువోలె ననంతములగు నాశల నావృతమ్మయి
యీ మహావిశ్వసంసార మిట్లు కొమ్మల నెత్తుచున్నది.

ఈ యాశాకుటుంబిని యగు పృథివి
మాయాభినేత్రుఁడగు సూత్రధారి త్రిప్పు చక్రమ్మువోలె
ముహుర్ముహు ర్యథా పురాతన మ్మయి
పూటపూటకు నావృత్త మగుచునుండు !

సూర్యచంద్ర మూలమ్మగు ఖగోళమ్ముముందు
సూక్ష్మమయ్యును సువిపులమ్మగు పృథ్వియందొక గ్రుచ్చిన సూదినై
ప్రాణాదిపంచకమ్ము ధరించి, జీవలక్షణమ్మగు నాశల నవధరించి
పవలు వెనువెంట రేయినై, రేయిలోని స్వప్నమ్ముననై మధురీభవింతు !

★ ★ ★

మాతృగర్భమునుండి తరియించి
మహిత జీవనకేళి కాసపడితిని !

★ ★ ★

మంత్రదండము వోల్కి నాశా
మంత్రమే నా జీవనమ్మున
యౌవనమ్మును సాకు వార్ధక
దావపావక శిఖలవలనఁ.

భావమందొక యాశ చివురించినపుడె యానందములు
పికములో యన గ్రీవమ్ము లెత్తి కూయఁగల్గినవి.
ప్రాయమందొక యాశ కిరణమై తోఁచెంచినపుడె చైతన్యములు
పిచ్చుకలఁ బోలె టెక్కలువిచ్చి వినోదించినవి.

లోచనమ్ముల నొకయాశ చుక్కయై మెఱసినపుడె యనుభావములు
విభావరీ గగననీలిమలఁ బోలె రంజిల్లినవి.
మేనియందొక యాశ చంద్రికను బోలి తళుకుమన్నపుడె సత్త్వములు
కడలి నురువులం బోలె నుల్లసిల్లినవి.

నెమలి యెఱకలఁ బారాడు
నిగనిగల మెఱయు నునుపుఁ బోలె
రమణీయమైన కెందమ్మిలోని
రాయంచ చిఱుఱెక్కరేకఁ బోలె
ఒక మహా సరిదంతరమున మిగిలి
ముకురమ్ము వలె వెలుఁగు పులినమ్ముఁ బోలె
చికిలి చేసిన యొక్క యాశాశలాక
జీవతంత్రుల భావమంత్రములు మీటు!

★ ★ ★

ఆశ మాధుర్య పర్యాయమో
సౌందర్య నామాంతరమ్మొ
రసికతా గుణము వినిర్మించుకొనిన
శారదా శేఖర జ్యోత్స్నయో కాని
ఇంద్రియాగోచరమ్మగు సువర్ణ వర్ణముల
నెఱుకపడరాని లిపిలోనఁ దోచు!
తోచి, యది మదీయ జీవనానంద కుసుమవృంతమయి
మత్పురాభవ భావ సౌరభోద్భవ మొనర్చు!

లోకావళీ చక్షురక్షీణ లక్ష్యమై
శోకాంధకారమ్ము ఛేదించు నాశ!
త్రైకాలికాంబర సితాసితత్వమ్ములో
శ్రీకారముల రంగవల్లి యగు నాశ!

కామ మోహ జిగీషు వాశ!
ప్రభుచరణ దిదృక్షువాశ!
కాలహయ ప్రతోద మాశ!
భావనారామ వైశాఖ మాశ!

# పుస్తకసమీక్ష

## నాట్యశాస్త్రము

1036 పుటలు    వెల. 20 రూ.

రచన: శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, ఎం.ఏ.
ప్రతులకు: డా. పి. సాంబశివరావు
306 & 307 - పీమ్‌కార్ బ్లాక్సు, చిక్కడపల్లి, హైదరాబాదు.

ఇది భరతమునికృతము నాట్యశాస్త్రమున కాంధ్రానువాదము. వట్టి అనువాదము కాదు. సవివరణము, సచిత్రము. శ్రీమదభినవగుప్తపాదాచార్యులవారి అభినవభారతీవ్యాఖ్యానమునకు తోడు, మిగిలిన ప్రాచ్యాలంకారికుల యొక్కయు, పాశ్చాత్య పండితులయొక్కయు మతములు చాల వరకు సమన్వయపరుపబడి వ్రాయబడిన నాట్యశాస్త్రానువాదమిది. "గుప్తభావప్రకాశికాసహిత" మని ఈ గ్రంథము పేర్కొనబడినది. దీనియర్థమిట్టిదని గ్రంథపరిశీలనానంతరము తెలియును. అభినవుల భావములను స్పష్టముగా వెలుగులోనికి తెచ్చుట యున్నది. ఆయన వ్యాఖ్యానము లేనిచోట్ల గుప్తముగా నున్న భావములను తెలుగువెలుగున చూపుట యున్నది. ఇట్టి పని ఒకటి రెండు రోజులలో నగునదికాదు. కొంతకాలముమీద కావలసినది. ఐనది. జగన్నాథపండితరాయ లనినాడు. "నిమగ్నేన క్లేశై ర్మనన జలధే రంతరుదరం,మయోన్నీతో లోకే లలితరసగంగాధర మణిః" అని. ఈ నాట్యశాస్త్రమును జాగ్రత్తగా చూచినచో మనన స్వరూపము తెలియును. దాని జలధిగుణమును తెలియును. అసలు మననమనగా 'శ్రుతస్యార్థస్యోపపత్తిభి శ్చింతనం మననమ్' అని. ఈ గ్రంథము కేవలమనువాదముగదా, ఇందే విషయము దేని కనుకూలముగా, నుపపత్తులవలన చింతన చేయబడినదన్నచో ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసుల బహువిషయములకు సంబంధించిన బహ్వంశము లుపపత్తులుగా నాట్యశాస్త్రము భరతాభినవుల హృదయముల కనుకూలముగా చింతన చేయబడినది. ఈ చింతనము నాట్యశాస్త్రము నందలి మొత్తము ముప్పైయారధ్యాయములలో ఇరవై యెనిమిదింటికి ఆయా అధ్యాయములకు చివర శ్రీ అప్పారావుగారిచేత వ్రాయబడిన "విశేషాంశము" లన్న గ్రంథములం దున్నది. అసలు మననము యొక్క ఫలముగా రావలసిన గ్రంథ మింతమాత్రమేకాదు. అది సమగ్రమును సవిమర్శకమును ఐన శాస్త్ర గ్రంథము కావలయును. దానిని "ముందుముందు ప్రకటింపగలను" అని శ్రీ అప్పారావుగారిందు వ్రాసినారు. అది త్వరలో ప్రకటింపబడుగాక.

ఒక గ్రంథ మనువాదమని తెలియగనే ముందు మూలముతో పోల్చిచూడవలయునన్న బుద్ధిపుట్టుట సామాన్యమైనది. ఆ సామాన్యబుద్ధితో నిట యేమియును చెప్పబడదు. శ్రీ అప్పారావుగా రీ గ్రంథమును తా మేయే మార్గముల ననుసరించి అనువాదము చేసినారో వాటిని ఉపోద్ఘాతములో చెప్పియున్నారు. వాటిని తిరిగి వ్రాయనక్కరలేదు. ఇంకను ఉపోద్ఘాతమున నాట్యశాస్త్రము యొక్క రచనాకాలము. కర్తృత్వము – పాఠభేదములు – అభినవుని వ్యాఖ్యానము–బరోడాముద్రణ (నాట్యశాస్త్ర) సంపాదకులు శ్రీ మానవల్లి కవి–ముద్రణముల వివరణము–అనువాదముల లెక్క – ఇత్యాది బహువిషయములు సంగ్రహముగను సోపపత్తికముగను శ్రీ అప్పారావుగారు వ్రాసిరి. శ్రీ పి. యస్. శాస్త్రిగారి "నాట్యశాస్త్రకర్తలు–వ్యాఖ్యాతలు" అన్న వ్యాస మొకటవ అనుబంధమున నున్నది. రెండవ యనుబంధమున నృత్త-నాట్య-నృత్య-రస-అలంకార శాస్త్రకర్తల యొక్కయు, వారి గ్రంథముల యొక్కయు జాబితా ఉన్నది. ఇది ఈ నాట్యశాస్త్రమునకు సంబంధించిన ప్రక్కవిషయముల స్వరూపము.

ఇక అసలు గ్రంథము. ముప్పైయారధ్యాయములు. కవి, గాయక, నట, విమర్శకులకు తమ తమ వృత్తులు సిద్ధినిపొందుటకుగాను వలసిన విజ్ఞత భరతమహర్షిచేత బహుధా ప్రపంచింపబడి నాట్యశాస్త్రమైనది. దానిని చాలభాగము పరమశైవు

డభినవుడు వ్యాఖ్యానించెను. తద్వ్యాఖ్యాన సహితముగా నేతద్విజ్ఞానమును శ్రీ అప్పారావుగారు తెనుగు నేలకు తెచ్చిరి. భారతీయమైన పటిష్ఠ సంప్రదాయములోని కావ్య నాట్యముల స్వరూపస్వభావములు తెలియని తన మీదేశమున విచ్చలవిడిగా వ్యాపించియున్నది. శ్రీ అప్పారావుగారి ఈనాట్యశాస్త్రమును చదువుకొనియైనను, దేశమా తనతెలియని తనమును పోగొట్టుకొనుట లెస్స. శంకరుని అద్వైతములోని రహస్య మెంతగా నెరిగిన అంతగా మానవుడు పరమేశ్వరుడైనట్లు. నాట్యశాస్త్రము నెంతగా పరిశీలించిన అంతగా భారతీయమైన సూక్ష్మసూక్ష్మవిశ్లథనపటువై యూహ చింతనచేసి కళను భావింపగలిగిన ధీశక్తి తెలియును. తెలియు ననగా తెలిసినవా డట్టిస్థితి కధికారి యగును. వీటి యధికారమును దేశీయులకు కలిగించుటకుగాను శ్రీ అప్పారావుగారుచేసిన శ్రమకు ఫలితముగా వచ్చిన ఈ నాట్యశాస్త్రమును దేశ ముపయోగించుకొనుట కావలయును. రస భావములనుగూర్చి, వివిధములైన అభినయములను గూర్చి, కావ్య నాటకముల రచనావిధానమును గూర్చి, చెప్పబడిన బహువిషయముల పరిజ్ఞానము నాగరకతా లక్షణముగా తెలియవలయును. కావ్యమన నేమో తెలియక, కనిపించిన ప్రతిపద్యము - ప్రతిగేయము ఇదే కావ్యమని అనుకొను దుస్థితి ఈ నాట్యశాస్త్రమునందలి "ఇతివృత్త నిర్మాణ" మన్న పందొమ్మిదవ అధ్యాయము చదివినచో సునాయాసముగా తొలగిపోగలదు. దీనితోపాటు 6, 7, 14-18 అధ్యాయములు చదివినచో రస భావముల యొక్కయు, ఛందోలంకారముల యొక్కయు, గుణదోషముల యొక్కయు, రూపకప్రక్రియాంతర్భేదముల యొక్కయు పుట్టుపూర్వోత్తరములతోడి సాంప్రదాయికములయిన సూక్ష్మవిషయముల పరిజ్ఞాన మనంతముగా కలుగును. ఇది ప్రధానముగా సాహిత్యాభిరుచిగల జనమునకు. మిగిలిన గ్రంథమంతయు, నాటకము లాడువారికి, ఆడించువారికి, చూచువారికి సంబంధించినది.

ఇది యొక విజ్ఞాన సర్వస్వమువంటి గ్రంథము. మొట్టమొదటిసారిగా నాట్యశాస్త్రమును సమగ్రముగా అభినవుని వ్యాఖ్యతోసహా సంపాదించి సంస్కరించి ప్రకటించిన గౌరవము తెనుగుదేశమునకు తెచ్చిన మనీషి శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు. ప్రపంచములోని ఏ యితర భాషలోనికిని ఇంతవరకు పూర్తిగా అనువదింపబడని నాట్యశాస్త్రమును మొత్తమును తెలుగులోని కనువదించి దేశ.భాషలకు రెండింటికిని గౌరవము కూర్చినది శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు. ప్రతి గ్రంథాలయమునను నుండి తీరవలసిన గ్రంథమిది. సాహిత్యాభిమానులు - నాట్యాభిమానులు జాగ్రత్తగా అధ్యయనము చేయవలసిన గ్రంథ మిది. ఇంత శాస్త్రగ్రంథము నింత తేట తెనుగున వ్రాసిపెట్టిన శ్రీ అప్పారావుగా రభినందనీయులు. సాహిత్యవిమర్శనము విమర్శనముగా నిలువద్రొక్కుకొనుచున్న ఈ రోజులలో సమయమునకు తగినట్లుగా ఈ నాట్యశాస్త్రము ప్రకటింపబడుట శుభసూచకము. ఇంతకుపూర్వమే కొంత కాలము క్రిందట ధ్వన్యాలోకము, తెలుగు సాహిత్యగ్రంథములనుండి ఉద్ధరింపబడిన ధ్వన్యుదాహరణములతో ఆంధ్రీకరింపబడియున్నది. ఇప్పు డీ నాట్యశాస్త్రము. ఇక సాహిత్య విమర్శనము పుంజుకొని సంప్రదాయమును సంస్థాపింపగలదు. తెనుగుల కివి మంచి రోజులు. ఆంధ్రావళి మోదముం బొరయచేసిన శ్రీ అప్పారావుగారి ఈ కృషి అద్వితీయమైనది.

—క్షేమేంద్ర.

## తెనుగు జానపదగేయ సాహిత్యము

పుటలు - 850 వెల : రూ. 15 లు

శ్రీ డా. బి. రామరాజు, ఎం.ఏ, పి.హెచ్.డి.
రీడరు, తెనుగుశాఖ.
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

శ్రీ బి. రామరాజుగారు 1952-55 సంవత్సరములలో ఉస్మానియా విశ్వవిద్యాలయమున తెనుగుశాఖ యందు ప్రథమ పరిశోధకులుగా చేరి చేసిన కృషి ఫలిత మీ సిద్ధాంత గ్రంథము. నిజముగా పరిశోధనము పరిశోధన మనిపించుకొనుటకు తగిన విషయములు కొన్ని యుండును. వాటిలో జానపద గేయ సాహిత్య మొకటి. ఇట్టి మరొకటి యక్షగాన సాహిత్యము. ఇంకను కొన్ని ఈరకముండవచ్చును. అసలు సంగతేమనగా ఆ జానపద గేయములు గాని, ఆ యక్షగానములు గాని మొత్తముగా నొకచోట రాశిపడి లేవు. ముఖ్యముగా జానపద గేయములానోట నానోట నున్నవి. వాటిని సాధ్యమైనంత వరకు సేకరింపవలయును. అందుకుగాను వ్యయ ప్రయాసల కోర్చి తిరుగవలయును. వారిని వారిని వెంటబడి పల్లెటూళ్ళలో ప్రవాసికొనవలయును. ప్రవాసికొందును చెప్పుమన్నచో చెప్పరు. మరి నదియునుగాక ఈ గేయము లధికముగా స్త్రీల నోళ్ళయం దుండును. తప్పుల్తడకలుగా నుండును. ఒక సారి యడిగినచో వారు చెప్పరు. మొత్తము మీద ఈ గేయములను సేకరించుట చాల శ్రమతో గూడిన పని. శ్రీ రామరాజుగారు తాను పడిన శ్రమను 'మనవి' మాటలలో స్పష్టముగా చెప్పినారు. ఇంత కష్టపడి వాటినన్నింటిని సేకరింపవలయును. అందలి తప్పుల నొప్పులుగా భావింపవలయును. విషయము నూహింపవలయును. విశ్లథనము చేయవలయును. ఒక కొలికికి లాగి సిద్ధాంతము చేయవలయును. శ్రీ రామరాజుగా రిన్ని పనులను చేయగా ఈ జానపద గేయ సాహిత్యమన్న గ్రంథము తయారైనది.

ఈ గ్రంథములోని విషయ విభాగ మిట్లున్నది: ప్రవేశిక పేరుతో నున్న ప్రథమాధ్యాయమున జానపద గేయ సాహిత్యముయొక్క పుట్టుపూర్వోత్తరములు విపులముగా చర్చింపబడినవి. పౌరాణిక గేయములన్న రెండవ అధ్యాయమునందు రామాయణ, భారత, భాగవత గాధలకు సంబంధించిన దాదాపరమై జానపద గేయములు పరామర్శింపబడియున్నవి. మూడవ అధ్యాయము చారిత్రక గేయములు, వీటి సంఖ్య పది. శైవ వైష్ణవ మత సంబంధములైన దాదాపు ముప్పై గేయముల పరామర్శ 4వ అధ్యాయము. పారమార్థిక గేయములన్న పేరుతో నున్న ఐదవ అధ్యాయమున కర్మ - భక్తి - వేదాంత గేయముల విషయమున్నది. స్త్రీల పాట లారవ అధ్యాయము. తరువాత శ్రామిక గేయములు, పిల్లల పాటలు, శృంగార గేయములు, అద్భుత రసగేయము, కరుణరసగేయము, హాస్యపు పాటలున్న పేర్లతో వరుసగా నొక్కొక్క అధ్యాయమున్నది. జానపద గేయములలోని భాషా సారస్వతములు, అందలి సాంఘిక విషయములు పదమూడు పదునాలుగు అధ్యాయములలోను, పదిహేను పదహారధ్యాయములలో జానపద గాయకులయొక్కయు, గేయముల వరుసలయొక్కయు వివరణమున్నది. పదిహేడవ అధ్యాయ ముప సంహారము.

జానపదులు కథలను మాత్రమే రామాయణాదులనుండి గ్రహింతురు. దానిని రచించుతీరు మాత్రము వేరు. కొన్ని గేయము లసలు పురాణములలోని కథలను తీసికొనక, అందలి ప్రధాన పాత్రలను తీసికొని అల్లబడి యుండును. జానపదుల బుద్ధి విభవము చాల తక్కువదగుట మూలముగా వారి యూహాలును అల్లే యుండును. తమతమ వాస్తవికమైన యనుభవములను మాత్రమేవారు కొంచెము చెప్పగలరుగాని అధికముగా భావన చేయలేరు. శ్రీ రామరాజుగారు తాముదాహరించిన గేయములనుండి జానపదుల సహజ సుంద

రములైన భావనలను విపులీకరించి చూపినారు. పురాణకథలను మార్చి తెలిసి తెలియక జానపదులేమేమో కల్పించుచుందురు. శివధనుర్భంగమునకుముందే శ్రీరాముడు మునివేషము వేసికొని, సీత పుష్పాపచయమునకని పోయిన ఉద్యానవనమునకు పోయినట్లు అచట వా రిరువురు సంభాషించుకొన్నట్లు గోదానాయకమ్మ వ్రాసిన పుత్రకామేష్టి యన్న పాటలో నున్నది. ఇట్టి చమత్కారములు జానపదుల గేయములలో లక్ష యుండును. సీతారాములు ముందుగా కలిసికొన్నట్లు తులసీదాసును వ్రాసెను. శ్రీ రామరాజుగారు పురాణసంబంధ గేయములుగా చెప్పిన వాటిని చాలవరకు విపులముగా విషయమును వివరించియున్నారు. చారిత్రక గేయములైన దేశింగురాజు కథ, బొబ్బిలి కథ, మొదలయిన వాటిలో జానపదుల వీరమునకు సంబంధించిన యూహ లెట్లున్నవో శ్రీ రామరాజుగారు చూపిరి. రసప్రాధాన్యమునుబట్టి విభజించినట్లుగానున్న శృంగార హాస్యాద్భుత కరుణ గేయములలో జానపదులయొక్క రసభావములయొక్క పరిణతి - దాని స్థాయి నిరూపింపబడియున్నవి. జానపదులలోను భక్తిజ్ఞాన కర్మములకు సంబంధించిన యూహ లుండునని సోదాహరణముగా నిరూపించినారు శ్రీ రామరాజుగారు. జానపద సాహిత్యమున శిష్టసాహిత్యమునందువలెనే అలంకారములు, నానుడులు, సామెతలు - మొదలైన వెట్లుండునో భాషాసారస్వతములన్న అధ్యాయమున సవివరణముగా వ్రాయబడి యున్నవి. జానపద గేయములనుండి వారి జీవనవిధానములు - వారి అలంకరణములు - వారి వినోదములు - వారి మతభావములు ఇత్యాదు అన్నియు సాంఘిక విషయములన్న అధ్యాయమున శ్రీ రామరాజుగారు స్పష్టముగా వ్రాసిరి. జానపదగాయకులైన శారదకాండ్రు - పిచ్చుకకుంట్లు, వీరముష్టివారు - బీరన్నలవారు - జంగములు మొదలైనవారి చరిత్ర సంగ్రహముగా వారి ఫోటోలతోసహా ఇచ్చినారు. గేయములను ప్రస్తరించి గతులను నిరూపించి శ్రీ రామరాజుగారు - మొత్తముమీద జానపద సాహిత్యమున కొక గౌరవమును గలిగించినారు. ఈ గ్రంథము శ్రీ రామరాజుగారి విషయవివేచనకు నికషోపలము వంటిది. వారికి జానపదగేయములమీద సహజముగా నేర్పడియుండిన ఒక అనురాగముయొక్క పైపొంగు ఈగ్రంథమునందు కొన్నిచోట్ల కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది. దేశములోని జానపదగేయముల నెన్నింటినో శ్రమపడి సేకరించి- ఆసాహిత్యమునకే గౌరవమును కూర్చుటకు యత్నించిన శ్రీ రామరాజుగా రభినందనీయులు. వారివలన జానపదసాహిత్యమున కొక రూపము వచ్చినది. ఈ జానపద సాహిత్యమన్న గ్రంథము సాహిత్యాభిమాను లందరును పరిశీలింపదగినది. ప్రతి గ్రంథాలయమునందును తప్పక ఉండతగిన గ్రంథమిది.

—క్షేమేంద్ర.

## నన్నెచోడుని కవిత్వము

గ్రంథకర్త :

**అమరేశం రాజేశ్వరశర్మ, బి. ఏ.**

*భాషాప్రవీణ.*

ప్రాప్తిస్థానము :

**అజంతా పబ్లికేషన్స్, సికింద్రాబాద్.**

**మూల్యము : రూ. 4-00**

కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారి అపూర్వ పరిశోధనాఫలముగ లభించి, శ్రీ తిరుమలవారనినట్లు, ఆంధ్రసాహిత్యమున ఈ అర్ధ శతాబ్దము నుండి గొప్ప అలజడి లేపిన ఏకైక మహాకావ్యము నన్నెచోడుని కుమారసంభవము. రామకృష్ణకవిగారీతనిని నన్నయ భట్టారకునికంటె పూర్వుడని నిర్ణయించుటచేత కాదని నిరూపించువారి కక్ష్యయొకటి ఏర్పడుటయు, ఆ వాదోపవాదములవల్ల భాషాప్రియులు కావ్యమువైపు ఆకర్షితులగుటయు జరిగినది. అట్టివారిలో శ్రీ శర్మగారొకరని వారి తొలిపలుకుల వలన దెలియుచున్నది.

విద్యార్థిదశలో నున్నప్పుడే వారు సలిపిన పరిశ్రమ, నిష్పాక్షికదృష్టి, విశేష విషయసేకరణలు ఈ గ్రంథములోని ప్రతి పుటయందును గోచరించును.

నన్నెచోడునికి సంబంధించినంతవరకు రెండే రెండు చిక్కులున్నవి. 1. కాలనిర్ణయము. 2. అతని వస్తుకవిత.

కవియొక్క కాలనిర్ణయముపట్ల, అతని వస్తుకవితా ప్రస్తావనపట్ల రచయిత తాను "శిష్టపంక్తి"ని గూర్చున్నవాలెనివలె ప్రసిద్ధ విమర్శకుల నుటంకించి సమర్థించుకొనుట గమనించదగినది. ఈ సందర్భమున శ్రీ కోరాడ, నిడుదవోలు వెంకటరావుగారూ చోడుని నన్నయ్య తిక్కనలకు మధ్యనున్నటు భావించినను, లక్ష్మీపతిశాస్త్రిగారి వాదముగాని తమ్మయ్యగారి వాదముగాని ఖండింపబడలేదను విషయము జ్ఞప్తియందుంచుకొనవలసినది. అదియుగాక బౌద్ధమతమునకు ప్రతిగా వైదిక మతమును ప్రచారించుటకు నన్నయ భారతమున్వ్రాసినట్లు వైష్ణవమతమునకు ప్రతిగా చోడుడు కుమార సంభవమును వ్రాసెనని యూహింపవచ్చునుగదా! వైష్ణవమత మప్పుడప్పుడే దక్షిణమునుండి వ్యాప్తిలోనికి వచ్చుచుండుట చర్చించవలసిన విషయము. ఇంతటి యుత్తమగ్రంథము ప్రచారమునుండి తప్పుటకుగల కారణములైనను శ్రీ శర్మగారు స్పృశించలేదు.

చోడుని గుఱించిన మఱియొక వివాద మాతని వస్తుకవితా ప్రసక్తికి సంబంధించినది. శర్మగారు 'వస్తు' వనగా ప్రకృతి రమణీయత లేక **'Natural grace'** యని "మనవాడు వస్తుతః మంచివాడను" లోకోక్తి నుదాహరించి సమర్థించుకొనిరి. కాని వస్తు వనగా **'Subject Matter'** లేక కథావస్తువుగ అన్వయించుకొనినచో నన్నెచోడుని యభిప్రాయమునకు సన్నిహితముగా నున్నట్లు వ్యక్తమగుచున్నది. చోడు డాదర్శకవిగా గ్రహించిన భారవి నైతము ఇంద్రనీల ఉదయగిరుల వర్ణనముల కథా వస్తు దృష్టిచే చేసినవేగాని కేవల ప్రకృతి సౌందర్యమున కావేశపూరితుడై యొనరించినట్లగుపించదు.

నన్నెచోడుడు ప్రకృతిని దీర్ఘముగ వర్ణించినపుడెల్ల "వర్ణించదగిన వర్ణనల వర్ణించుచు" అని సమాధాన పరుచుకొనిననట్లు ధ్వనించుట గమనార్హము, ఉ. (కుమార సంభవము 8-19, 7-132 మొ.) ఇట్లే ప్రతి అశ్వాసాంతమున మహాకావ్యమనియో ప్రబంధ మనియో వాడక కుమార సంభవమును 'కథ' యందనుటయు గమనార్హమే యగుచున్నది.

కావ్యములోని శిల్పము విశిష్టత పునః పునరుక్తులుబ్దములుగావు కాని రసమును గుఱించి విపులముగ చర్చించిన బాగుండెడిది. · కావ్యములో సతీశివుల కల్యాణము, కుమార తారగా సురసంగరమును వేర్వేరు భాగములుగా గ్రహించిన సాముదాయికముగ శృంగార వీరరసములు రెండును ప్రధాన రసములుగా గనబడును. శృంగారమునే స్థాయిగాగొని దానినే ప్రధానరసముగా వీరరసము నంగరసము మాత్రమే యని నిడుదవోలువారన్నారు. వీరి అభిప్రాయమునే శర్మగారు క్లుప్తముగా బలపరచుచు అనవసరపు పది పంక్తులను వ్రాసిరి. ఈ యుత్తమరచనకు సంకలనదోషమొకటి కొన్నిచోట్ల అంటినట్లుండుట విచార్యము.

నన్నెచోడుడు తన తరువాత వచ్చిన కవులకు మార్గదర్శకు డెట్లాయెనో నిరూపించు సందర్భమున శర్మగారనుసరించిన పద్ధతి చాల సమంజసముగాను అనుకరణీయముగాను ఉన్నది. చోడునితో ప్రారంభమైన సీసపద్యములోని సొంపు, విరుపులు శ్రీనాథునిలో పరాకాష్ఠ నొందినవి. చోడుని సీసపద్యములలోని పాదములు కొన్నిచోట్ల కుంటువడుచున్నట్లగుపించినను నడకలోని అందమున కానాడే అంకురార్పణ మైనదనవచ్చును. ఈనాటికి విశ్వనాథవారి చేతిలో పరాకాష్ఠనందిన తెనుగు పద్యశిల్పమును నన్నెచోడుడే ప్రారంభించినట్లు వ్యక్తమగును. (కుమార సంభవము 2-68) శ్రీ శర్మ

గారు చోడుని పద్యములను వివరించినట్లు దాదాపు 600 గల వచన ఖండములను సైతము చర్చించిన బాగుండెడిది.

కుమార సంభవములోని ఔచిత్యదృష్టి నిరుపమానమైనది. విఘ్నేశ్వరుడు జన్మించినప్పుడు దేవత లందరు సంతోషించుట ఒకఎత్తు; 'ఆదివ్య సింధుర యూధంబు మదంబు సేసె' ననుట ఇంకొక ఎత్తు. ఇది మహాకవులకే చెల్లదగినది. ఈ రీతిగనే దాక్షాయణి తన తండ్రితో సంభాషించిన వైనము (2-18,19) కావ్యసాహిత్యమునందే అపురూపమైనది. రతీ మన్మథుల వాద మీ గ్రంథమునకు కాళిదాసుని కుమారసంభవములో లేని వన్నెను దెచ్చినదనిన అతిశయోక్తిగాదు. కాని పవిత్రమైన శివకల్యాణపు రాత్రి వినోదములు జరిగిన సందర్భమును పురస్కరించుకొని నన్నెచోడుడు వర్ణించిన వారాంగనా విచిత్ర రతి ఎంతవరకు సమంజసమో చర్చించిన శర్మగారి గ్రంథమునకు మరింత బిగువు వచ్చెడిది.

ఇట్లే ఆనాటి సాంఘిక పరిస్థితుల పరిశీలించుచు శ్రీ శర్మగారు చోడుని గాలమున రాజ్య మాతని వలుకుబడిలో లేనట్లూహించుటకు చారిత్రకనిదర్శనములు దప్ప ఒకటి రెండు పద్యములు చాలవు. ఐనను విషయసేకరణకై శర్మగారు విస్తారమైన కృషి సల్పినట్లు ప్రతి పుట సాక్ష్యమిచ్చుచునే యున్నది.

ప్రథమ ప్రయత్నముననే ఇంత సొంపైన శైలిలో నన్నెచోడుని గుఱించిన చిన్ని విజ్ఞానకోశ మనదగు ఉత్తమ గ్రంథము నర్పించిన శ్రీ శర్మగారు సత్యముగా అభివందనీయులు. వారి అమూల్యమైన కృషిని నాలుగు రూకలలోనే అందించగలిగినందులకు శ్రీ అంజతా సోదరులు సైతము ప్రశంసనీయులే యనక తప్పదు.

—కృష్ణమూర్తి

## వచ్చే సంచికలో

మాచిరాజు దేవీప్రసాద్

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

సోమసుందర్

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఉన్నవ విజయలక్ష్మి

శంఖల

జువ్వాది రామేశ్వరరావు

కొర్లపాటి శ్రీరామమూర్తి

విశ్వనాథ సత్యనారాయణ

[illegible], సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : [illegible]